

# పండుగల పరమార్థం



వివరణ :

సువర్ణార్థి

(డా. కోదూరి సుబ్బారావు)



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ



## అనేక నామములతో పిలువబడు ఓ సృష్టికర్తా!
## నాకు మేధాబుద్ధిని ప్రసాదింపుము

**మేధామ్మే వరుణో దదాతు మేధామగ్నిః ప్రజాపతిః।**
**మేధా మిన్ద్రశ్చ వాయుశ్చ మేధాం ధాతా దదాతు మే స్వాహా ॥**

– యజుర్వేదం (32-15).

వాక్యార్థం :

**మేధామ్+మే వరుణః దదాతు** = వరణీయ సర్వశ్రేష్ఠ పరమేశ్వరుడైన సృష్టికర్త నాకు మేధస్సును (సత్యగ్రహణ సామర్థ్యంగల బుద్ధిని) ప్రసాదించును గాక!

**మేధామ్+అగ్నిః ప్రజాపతిః** = జ్ఞాన ప్రకాశకుడు, సకలప్రాణి పాలకుడునైన సర్వేశ్వరుడు నాకు మేధా బుద్ధిని ఇచ్చునుగాక!

**మేధామ్ +ఇంద్రః +చ వాయుః +చ**= సకలైశ్వర్య కర్తయు, అత్యంత బలశాలియునగు దేవదేవుడు నాకు ఆత్మికోన్నతిని కలిగించు మేధస్సు నిచ్చును గాక!

**మేధామ్ ధాతా దదాతుమే** = సకల విశ్వాన్ని తనలో ఏకపాదంగా (1/4గా) ధరించిన పరమాత్మ నాకు మేధాబుద్ధినిచ్చి కాపాడునుగాక!

**స్వాహా (సు+అహా)** = ఓ సృష్టికర్తా! నీ వేదవాణి సత్యం. నా ఈ కథనం సత్యం.

అనేక నామములకు వేద ప్రమాణం : ఇంద్రం మిత్రం వరుణమగ్నిం.........
ఏకం సత్+విప్రా బహుధా వదన్తి.......... ఋగ్వేదం *(1-164-46)*

May the supreme God grant me wisdom, in consonance with the performance of religious duty. May the omniscient God grant me wisdom. May the omnipotent God grant me wisdom. May the almighty father grant me wisdom. May the ruler of the universe grant me wisdom.



# పండుగల పరమార్థం




వివరణ :

**సుమ్నార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

గాయత్రీ గ్రంథమాల : 61

# పండుగల పరమార్థం

ప్రథమ ముద్రణ : ప్రతులు 1000



సృష్టి సంవత్సరము = 197,08,53,116 (మన్వంతర సంధిరహితం)
197,29,49,116 (మన్వంతర సంధి సహితం)

విక్రమాబ్దము : 2072

దయానందాబ్దము = 192.

శ్రీ మన్మథ నామ సంవత్సరము, ప్రపంచ యోగదినము

తేది : 21-06-2015.

మూల్యము : **రూ. 40-00**

**ప్రతులకు :**

1) **డా॥ కోదూరి సుబ్బారావు,** వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం, భువనగిరి గంజ్ - 508 117,
సెల్ : 9908994084, 9290604641.

2) **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు - ఆర్య సమాజము మేడిబావి,**
12-10-586/6, ఇందిరానగర్, రోడ్ నెం. 2,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061, సెల్ : 9848011073.

3) **ఆర్యసమాజము - సీతాఫలమండి,** సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 040-27071816, 69990967, 9246174018.

4) **పం. మురళీ బ్రహ్మచారి,** జూలమ్మగుడి ఎదురుగా,
రెజిమెంటల్ బజార్, సికింద్రాబాద్. ఫోన్ : 9441033702

**డి.టి.పి. & ప్రింటింగ్ :**

**విక్రాంత్ ప్రింట్ హౌస్,**

వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

ఫోన్ : 9705085608.



# ఈ పుస్తకంలో........



**చదవండి - ఆలోచించండి**
**సత్యాన్నిగ్రహించి ఆచరించండి**




# పుస్తక నేపథ్యం (Foreword)

సుమారుగా 3 సంవత్సరాలుగా మా సీతాఫలమండి ఆర్యసమాజం ద్వారా నెల నెలా 4 పేజీల కరపత్రాలు ముద్రించి వితరణ చేస్తున్న విషయం మీ అందరకు తెలిసినదే. అందుండి యజుర్వేద 40వ అధ్యాయ మంత్రాలను "ఈశావాస్య మిదం సర్వమ్" అనే పేరుతో ఒక పుస్తకంగా మా గాయత్రీ ఆశ్రమట్రస్టు ద్వారా ప్రచురించటం జరిగింది. అట్లే, పండుగలను గురించిన కరపత్రాలను కలిపి ఒక పుస్తకంగా ప్రచురిస్తే బాగుంటుందని కొందరు భక్తులు కోరుతున్నారు. అందుచే "పండుగల పరమార్థం" అనే పేరుతో ఈ పుస్తకం ప్రచురిస్తున్నాము. కరపత్రాలు 4 పేజీలవే కనుక పండుగలను గురించి సంక్షిప్తపరచి (Short & Sweet గా) వ్రాయటం జరిగింది. వాటిని మరికొంత వివరించి వ్రాసే ఓపిక నాకిప్పుడు లేదు. అందుచే వాటిని యాథాతథంగా ప్రచురిస్తున్నాము. నా కరపత్రాలు చదివిన భక్తులు, సమాజ కార్యకర్తలు, చిన్న చిన్న ప్రచారకులు ఈ వైజ్ఞానిక పద్ధతి చాలా బాగున్నదనీ, సామాన్యులకు కూడా విషయాలు తేటతెల్లమౌతున్నాయనీ, ఇతరులకు చెప్పటానికి మాకుకూడా కొత్తవిషయాలు తెలుస్తున్నాయనీ ఫోనులో చెప్పుచున్నారు.

**<u>ఋషిఋణం తీర్చుకోవాలంటూ – ఒక కన్నడ దంపతులు :</u>**

మా ప్రచురణలు, కరపత్రాలు కర్ణాటక ప్రాంతంలోనూ విస్తరిస్తున్నాయి. చిక్‌బల్లాపూర్ జిల్లా, గౌరీబిదనూర్ వాస్తవ్యులు శ్రీ. హెచ్. రాజగోపాల నాయక్, సుధామణి దంపతులు 6 సంవత్సరాల క్రిందట మా భువనగిరి ఆశ్రమంలో నిర్వహించే ఆధ్యాత్మిక శిబిరంలో పాల్గొని వెళ్ళారు. అప్పుడు మా సాహిత్యం కొంత తీసుకు వెళ్ళటం, అనంతరం నెల నెలా కరపత్రాలు అందుతూ ఉండటంవల్ల వారిలో చక్కటి జ్ఞానవికాసం కలిగింది. యజ్ఞాలు, సత్సంగాలు నిర్వహిస్తూ మంచి ప్రచారకులయ్యారు. ప్రవచనాలు చెప్పటానికి మా సాహిత్యం ఉపకరిస్తున్నదన్నారు ఋషిఋణం తీర్చుకోవాలంటూ రూ. 5,000/–లు పంపారు. మీ ఫోటో సంక్షిప్త పరిచయం వ్రాసి పంపమంటే – అవేమీ వద్దన్నారు. పోనీ పేరు వ్రాసుకోనా? అంటే ముందు అదికూడా వద్దన్నారు. తదుపరి "మీ సాహిత్య ప్రచారం కర్ణాటకలో కూడా విస్తరిస్తున్నట్లుగాను, మాకు ఆ జ్ఞానం ఉపకరిస్తున్నట్లుగాను సంక్షిప్తంగా వ్రాసుకోవచ్చు"నన్నారు. వారి నిష్కామ సేవకు నా హృదయ పూర్వక ధన్యవాదములు. విక్రాంత్ ప్రింట్ హౌస్ వారికి, దాతలకు నా శుభాకాంక్షలు.

– సుమ్నార్థి
(డా. కోడూరి సుబ్బారావు)

# దాతల పరిచయాలు

శ్రీ గోపగోని ఎట్టయ్యగారు మున్సిపల్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేసి రిటైరయ్యి, భువనగిరిలో నివాసం ఏర్పరచుకున్నారు. వీరికి 1980లో శ్రీమతి సైదమ్మగారితో వివాహం జరిగింది. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె కలిగారు. కుమారు లిద్దరికి వివాహం జరిపించారు. పెద్ద కుమారునికి ఇద్దరు సంతానం కూడా కలిగారు. ఉద్యోగరీత్యా హుజూర్ నగర్‌లో ఉండగా వీరికి ఆర్యసమాజంతోనూ, వైదిక సిద్ధాంతాలతోను పరిచయం కలిగింది. క్రమంగా వివేకం వికసించి వైదిక సిద్ధాంతాలపై గట్టి శ్రద్ధాభక్తులేర్పడ్డాయి. ఆ ప్రభావంతోనే భువనగిరిలోని మా వైదిక వానప్రస్థసాధకాశ్రమానికి సన్నిహితులయ్యారు. ఉదయం 4 గంటలకే నిద్రలేచి కాలకృత్య స్నానాదులు పూర్తిచేసుకొని 5 గంటలకు ఆశ్రమం చేరుకుంటారు. యోగా తరగతులలోను, అనంతరం మా ఉదయకాల సంధ్యాగ్నిహోత్ర, సత్సంగాలలోను పాల్గొని 10 గంటలకు బయలుదేరి యింటికి వెడతారు. ఏ కారణం చేతనైనా మా పురోహితులు లేకపోతే వారే ఉదయకాల సత్సంగాన్ని నిర్వహిస్తారు. ఆశ్రమకార్యాలయానికి, మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు పనులకు, నాకు, ఆశ్రమవాసులకు అందరికి సహకరిస్తూ ఉంటారు. సేవలు అందిచటమేకాక యజ్ఞ సామానులకు, గురుకులాలకు, ప్రచారానికి ఆర్థికసాయం అందిస్తూ ఉంటారు. 10 సంవత్సరాలుగా వీరు ఈ సేవలు అందిస్తున్నారు. ఈ పుస్తక ముద్రణకు మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు రూ. 5,000/–లు దానముగా ఇచ్చినారు. వారికి, వారి కుటుంబానికి సర్వవ్యాపక సర్వేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి కాపాడునుగాక!

## శ్రీ బాశెట్టి సత్తయ్యగారు

ఆర్యజగత్తులో గురుకుల బంధువుగా వీరందరికి సుపరిచితులే. వీరికి గురుకులాలపైనా ప్రచారకార్యక్రమాలపైనా ఎక్కువ అభిమానం. దానితో వీరు వాటికి తనుమనోధనాలతో సేవచేయటానికి సదా సిద్ధంగా ఉంటారు. వీరుకూడా ఈ పుస్తక ముద్రణకు రూ. 5,000/–లు దానంగా యిచ్చారు. వీరే మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు ఆది నుండి అధ్యక్షులుగా ఉండి సాహిత్య ప్రచారంలోను, లెక్కలు వ్రాయటంలోను, నా వ్యక్తిగత అవసరాలలోను సేవలందిస్తున్నారు. వీరికి సర్వవ్యాపక సర్వేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్యాలను ఐశ్వర్యాదులను ప్రసాదించునుగాక!



# పండుగల పరమార్థం

**పండుగలే పర్వాలు :**

పండుగలను సంస్కృతంలో పర్వము లంటారు. పర్వ పదము తెలుగులోనూ వాడుకలో ఉంది. వ్యాసమహర్షి తాను వ్రాసిన వాస్తవిక చరిత్రగ్రంథమైన మహాభారతంలోని అధ్యాయాలకు పర్వములని పేరు పెట్టారు. ఆదిపర్వము, సభాపర్వము, అరణ్యపర్వము....... ఈ విధంగా 18 అధ్యాయాలకు 18 పేర్లు పెట్టారు. తెలుగు నిఘంటువులో పర్వపదమునకు చెఱకుగడ కనుపులు, శుక్లకృష్ణపక్షాల సంధులు (అమావాస్యా పౌర్ణమిలు), జడముడులు, పండుగలు మొదలైన మరికొన్ని అర్థాలున్నాయి. వాటిలో వ్యాసమహర్షి 'చెఱకుగడ కనుపులు' అనే అర్థాన్ని తీసుకొని అధ్యాయాలకు పేర్లు పెట్టారు. చెఱకుగడ కనుపు కనుపుకు రుచిలో స్వల్ప భేదం ఉంటుందట. అట్లే భారతాధ్యాయాలలోకూడా రుచులుంటాయని వ్యాసమహర్షి అభిప్రాయమని పెద్దలంటారు. చాంద్రమాన శుక్లకృష్ణ పక్షాల సంధులైన పౌర్ణమి అమావాస్యలను పూర్వం పండుగలుగా సెలవు దినాలుగా (Holidays గా) జరుపుకునేవారు. ఆంగ్లేయ పాలనలోనే ఆదివారాలను సెలవుదినాలుగా బలవంతంగా మనపై రుద్దారు. కనుక మన సంప్రదాయాన్ని అనుసరిస్తూ ఈ పుస్తకంలో పౌర్ణమి, అమావాస్యల పరమార్థాన్ని ముందుగా చేర్చాము.

ఇక సంస్కృతంలోనూ పర్వపదమునకు చాలా అర్థాలున్నాయి. ఇది "పౄ- పాలన పూరణయోః" అనే మూల సంస్కృత ధా తువుతో నిర్మింపబడుతుంది. కనుక "పాలించేది, పూరించేది" అని మూలార్థం (Root Meaning). పండుగ వస్తున్నదంటే ముందుగానే ఇంట్లో ఉండే చెత్తా చెదారం బయటపడేసి ఇల్లు శుభ్రం చేసుకుంటాము. పండుగరోజున పెందలకడనే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని అభ్యంగన స్నానంచేస్తాము. క్రొత్త బట్టలు లేదా మంచి బట్టలు కట్టుకుని ముందుగా సృష్టికర్తను స్మరించుకొని పూజలు, యజ్ఞాలు చేస్తాము. పెద్దలకు పాదాభివందనం లేదా వినయంగా నమస్కరించి వారి ఆశీస్సులందుకుంటాము. దానివల్ల మన కెంతో తృప్తి, ఆనందం కలుగుతాయి. ఇవన్నీ పరోక్షంగా మనలను

పాలిస్తాయి. కాపాడతాయి. మనకు సద్భావనలు, సత్సంకల్పాలు కలుగుతాయి. అవి మనకు ఉన్నతిని కలిగిస్తాయి. పర్వ పదమునకు రెండవ అర్థం - పూరించటం. నింపటం. శరీరంలోని, మనస్సులోని లోటుపాట్లను పర్వాలు (పండుగలు) పూరిస్తాయి. సామాన్యంగా మనం సామాన్య దినాలలో సామాన్య భోజనం చేస్తూంటాము. అది అన్నం, రొట్టెలు, కూరలు, పచ్చళ్ళతో సామాన్యంగా ఉంటుంది. ఇవన్నీ పిండి పదార్థాలు. ఇవి కేలరీలను - శక్తిని మాత్రమే ఇస్తాయి. పండుగనాడు విశేషంగా పిండివంటలతో భోంచేస్తాము. పప్పులు, నెయ్యి నూనెలతో చేసినవి, పాలతో వండినవి తింటాము. దానితో మన శరీర నిర్మాణానికి కావలసిన ప్రొటీన్లు, క్రొవ్వులు, కాల్షియం, పొటాషియం, మెగ్నీషియం మొదలైనవి అందుతాయి. వాటితో శారీరక ఎదుగుదలలు, అరుగుదలలు పూరింపబడతాయి. కనుకనే మన ఋషులు పర్వాలను, వాటి విధివిధానాలను రూపకల్పన చేశారు.

యాస్కమహర్షి కృత నిరుక్త శాస్త్రం (1-20) పర్వ పదమునకు మరికొన్ని విశాలమైన అర్థాలు చెబుతుంది. "దేనిద్వారా బంధుమిత్రులు పరస్పరం ప్రీతితో కలుసుకొని శుభాకాంక్షలు చెప్పుకుంటారో" అదియును పర్వమే నంటుంది. ఋగ్వేదం (4-22-2) లో **"పర్వాణి సఖ్యాయ వివే"** అనే వాక్యం వస్తుంది. అంటే - పర్వాలు (పండుగలు) ప్రజలలో పరస్పరం సఖ్యతను (మైత్రీభావాన్ని) పెంచేవిగాను, పరమమిత్రుడైన పరమేశ్వరునితో సఖ్యతను పెంచేవిగాను జరుపుకోవాలని అర్థం. యాస్క మహర్షి రెండవ అర్థంగా - "అర్ధమాస-పర్వ దేవానస్మిన్ ప్రేణన్తీతి" - అర్ధమాసానికి వచ్చే పౌర్ణమీ అమావాస్యలను పర్వములంటారు. ఆ దినములలో విశేష హోమాలను చేసి దేవతలను (పంచభూతాలను, ప్రాకృతిక శక్తులను) తృప్తిపరచాలంటారు. తైత్తరీయ సంహిత (2.56.6)లో "అర్ధమాసే దేవా ఇజ్యన్తే" అంటుంది. ప్రాకృతిక దేవతలను తృప్తి పరచటానికి అగ్నిహోత్రమే ముఖ్యమంటుంది. అదే సరైన దేవపూజ అంటుంది. కనుకనే మేము ఈ **"పండుగల పరమార్థం"**. పుస్తకంలో పౌర్ణమి అమావాస్యలను మొదటి పర్వాలుగా చేర్చాము. అగ్నిహోత్రంద్వారా దేవపూజ అన్ని పర్వాలలోను జరుపుకోవలసిందేననీ, ఆ యా పర్వాలకు చెందిన మంత్రాలతో ఆహుతు లివ్వవలసిందేననీ మహర్షు లన్నారు. ఆ వివరాలు ఆర్యవిద్వాంసులు సంకలనంచేసిన **"ఆర్య పర్వపద్ధతి"** లో చూడగోరుచున్నాము.

# పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి

పరమేశ్వరుని అద్భుతాద్భుత సృష్టిలో పౌర్ణమి ఒక విశిష్ట దినం. ఆ రోజు రాత్రి ఆకాశంలో చంద్రుడు పూర్ణంగా కనబడతాడు. తన ఆహ్లాదకరమైన వెన్నెలతో మనను పరవశింపచేస్తాడు. మననేకాక సృష్టిలోని స్థావర జంగమ ప్రాణులనన్నిటిని ప్రభావితం చేస్తాడు. ముఖ్యంగా చంద్రుని ప్రభావం సముద్రంపై స్పష్టంగా కనబడుతుంది. వెన్నెల ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా అలలు పైపైకి లేస్తూఉంటాయి. సూర్యకిరణాలపై పరిశోధన చేసినట్లే కొందరు ఔత్సాహిక విజ్ఞానవేత్తలు చంద్రకిరణాలపై పరిశోధనలు చేశారు. కొన్ని ఆసక్తికరమైన విషయాలను వెలుగులోనికి తెచ్చారు. చంద్రకిరణాల ప్రభావం పంటలపై విశేషంగా ఉంటుందట. ముఖ్యంగా కాయ, పప్పు ధాన్యాలు పాలు పోసుకునే సమయంలో (గింజలు ఏర్పడే సమయంలో) వెన్నెల ప్రకాశవంతంగా ఉంటే ఆ సంవత్సరం పంట దిగుబడి ఎక్కువగా ఉన్నట్లు గుర్తించారు. "పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ - రసాత్మకుడైన సోముడు (చంద్రుడు) సర్వ ఓషధులను పుష్టివంతం చేస్తాడు." అని కదా! గీతావచనం (15.13). వేడి, మంటలు మొదలైన బాధలతో ఉన్న రోగులు వెన్నెలలో ఉంటే వారి బాధలు కొంత ఉపశమించినవట. తెల్లటి పారదర్శక సీసాలలో నీరు పోసి రాత్రంతా వెన్నెలలో ఉంచి ఆ నీటిని సేవిస్తే వేడితత్త్వ రోగులకు కొంత ఉపశమనం కలిగిందట. మానసిక రోగులపై చంద్రకిరణాలు ప్రభావం చూపుతున్నాయట. ఇట్టివే మరికొన్ని విషయాలు చెబుతున్నారు.

పౌర్ణమి చంద్రుని దర్శనం భగవద్భక్తులకు మరింత ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. సృష్టికర్త మహిమను మరింత ప్రకటింప చేసి వారి భక్తిని మరింత పెంచుతుంది. కన్యాకుమారి వంటి మూడువైపుల సముద్రంకల ప్రదేశాలలో ఈ దర్శనం చాలా మనోహరంగా ఉంటుంది. ఆ రోజు పడమటివైపు సూర్యుడు అస్తమిస్తూ ఉంటే తూర్పున చంద్రుడు ఉదయిస్తూ ఉంటాడు. ఆ రాత్రంతా పూర్ణచంద్రుని దర్శనం చేసుకోవచ్చును. మరునాడు ఉదయం సూర్యుడు ఉదయిస్తూ ఉండగా చంద్రుడు అస్తమిస్తూ ఉంటాడు. రెంటినీ ఒకేసారి చూడవచ్చు. ఇట్టి విశిష్టతలు కలిగి ఉండబట్టే

మన ఋషులు చంద్రుని ఒక దేవతగా – వసుదేవతగా లెక్కించారు. వసుదేవతలంటే ప్రాణులను వసింపజేసేవి. అవి 8. పంచభూతాలు + సూర్య చంద్ర నక్షత్రాలు. వీటి ఆధారంతోనే ప్రాణులు జీవిస్తున్నాయి. అట్టి వసుదేవతలలో ఒకటయిన చంద్రునికి పౌర్ణమిరోజున దైనిక అగ్నిహోత్రంలో 3 విశేష ఆహుతు లివ్వాలని ఋషుల నిర్దేశం. అవి –

1) **ఓం అగ్నయే స్వాహా** – అగ్ని దేవతకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.
2) **ఓం అగ్నిషోమాభ్యాం స్వాహా** – అగ్ని మరియు సోములకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.
3) **ఓం విష్ణవే స్వాహా** – వ్యాపక గుణముగల అగ్నిసోములకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.

**వివరణ :** అగ్నితత్వం ఎప్పుడూ సృష్టిలో వ్యాపించి ఉంటుంది. భూలోకంలో సామాన్య అగ్నిగాను, భువర్లోకంలో (వాయువు సంచరించే అంతరిక్షంలో) జాతవేదాగ్నిగాను, స్వర్లోకంలో (సూర్యాది గోళాలు ఉన్నచోట) అంగిరాగ్నిగాను ఉంటుందని ఋషులంటారు. ఈ మూడు అగ్నులను అగ్నిహోత్రం బలపరుస్తుంది. అందుకనే అగ్న్యాధానం చేసిన అనంతరం 3 విశేష సమిధలను మంత్రపూర్వకంగా హోమకుండంలో ఉంచుతారు. పై మూడు వాక్యాలలోని మొదటి వాక్యంతో అట్టి అగ్నికి ఆహుతి ఇవ్వబడింది. రెండవ వాక్యంలో అగ్నితత్త్వంతో బాటు పౌర్ణమి రోజున సోమతత్త్వం విశేషంగా ఉంటుంది. (సోముడు అంటే సౌమ్యంగా – చల్లగా హాయిగొల్పేవాడని అర్థం. ఇట్టి సౌమ్యగుణం ఎక్కువగా ఉండటంవల్ల చంద్రుని సోముడంటాయి మన శాస్త్రాలు). అట్టి అగ్నిసోములకు రెండవ ఆహుతి ఇవ్వబడుతుంది. ఈ రెండు తత్త్వాలు ఒకే చోట స్థిరంగా ఉండక వ్యాపించే గుణం కలిగి ఉంటాయి కనుక మూడవ వాక్యంతో 'ఓం విష్ణవే స్వాహా' అంటూ ఆహుతినిస్తారు. ఈ మూడు ఆహుతులను నేతితో బాటు ఒక తీపిపదార్థాన్ని కూడా కలిపి ఆహుతిగా ఇవ్వాలని గృహ్యసూత్రాలు చెబుతాయి. అనంతరం–

1) **ఓం భూరగ్నయే స్వాహా – ఇదమగ్నయే– ఇదన్నమమ.**
2) **ఓం భువర్వాయవే స్వాహా – ఇదం వాయవే – ఇదన్నమమ.**

**3) ఓం స్వరాదిత్యాయ స్వాహా - ఇదమాదిత్యాయ - ఇదన్నమమ.**

**4) ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా - ఇదమగ్ని వాయ్వాది తేభ్యః ఇదన్నమమ.**

అంటూ 4 ఆహుతులనిచ్చి యజ్ఞాన్ని పూర్తి చెయ్యాలి. ఈ వాక్యాల భావమేమంటే అగ్నిహోత్రంలో వేసిన ఆహుతులు భూలోకంలో అగ్నిగాను, భువర్లోకంలో (అంతరిక్షంలో) వాయువుగాను, స్వర్లోకంలో ఆదిత్యునిగాను మార్పుచెందుతాయని చెప్పటం.

ముఖ్యంగా గృహస్థులు ఈ పౌర్ణమాస్యేష్టిని పుత్రుల సంక్షేమాన్ని కోరుతూ చేస్తారు. ఏవిధంగా శుక్లపక్ష చంద్రుడు దినదినం ప్రవర్ధమానం అవుతూ పౌర్ణమినాటికి పూర్ణత్వాన్ని పొందుతాడో, అట్లే నా పుత్రులు దినదినాభివృద్ధి చెందుతూ శారీరకంగా, బౌద్ధికంగా, ఆత్మికంగా పూర్ణత్వాన్ని పొందాలని కోరుకుంటారు. తమ కుటుంబకీర్తిని, వంశకీర్తిని మరింత ఇనుమడింపచేయాలని ఆశిస్తారు. ఇచ్చట పుత్రులంటే కేవలం మగసంతానమే కాదు, పుత్రికలు కూడా. యజుర్వేదంలోని కర్మకాండను వివరించే శతపథబ్రాహ్మణం పౌర్ణమాస్యేష్టి యజ్ఞ వివరణతోనే ప్రారంభమౌతుంది. అక్కడ ఆ కర్మకాండ చాలా విశాలంగా ఉంటుంది. దాని సంక్షిప్తరూపమే ఈ పక్షయజ్ఞం. ఇక మనం పౌర్ణమాసీ దేవుణ్ణి గురించి ఆలోచిద్దాము.

వేదాలలో దేవునికి 100కు పైగా పేర్లు కనబడతాయి. ఒక్కొక్క పేరు అతని ఒక్కొక్కగుణాన్ని సూచిస్తాయి. వాటిలో 'పౌర్ణమాసీ' అనేది ఒకటి. ఈ విశాల విశ్వంలో అంతటా అన్నిటా పూర్ణంగా నిండి ఉంటాడు. (పూర్ణమ్ + ఆసీత్) కనుక దేవునికి 'పౌర్ణమాసీ' అనే పేరు ఏర్పడింది. చంద్రుడు తన పరిధిలో తాను పూర్ణంగా ఉన్నరోజు కనుక పౌర్ణమి అని మనం వ్యవహరిస్తున్నాము. అందుచే భౌతిక చంద్రదేవతకు ఇచ్చే ఆహుతులతో బాటు సృష్టిఅంతా పూర్ణంగా ఉండే 'పౌర్ణమాసీ' దేవునకు కూడా ఆహుతులిస్తే బాగుంటుంది. దేవుని మహిమను, పూర్ణత్వాన్ని గుర్తించినవారము, స్మరించినవారము అవుతాము. అథర్వవేదం సప్తమకాండలోని 81వ పౌర్ణమాసీ సూక్తంతో ఆహుతులిస్తే సందర్భోచితంగా ఉంటుంది.

ఈ క్రింది పౌర్ణమాసీ సూక్తం చాలా చిన్నది. నాలుగే మంత్రాలున్నాయి.

కాని, వాటిలో గంభీరమైన అర్థం ఉంది. పరిశీలించండి. ఈ మంత్రాల చివర 'స్వాహా' కారం పలుకుతూ ఆహుతి నర్పించాలి. అనంతరం 'ఇదం పౌర్ణమాస్యై - ఇదం న మమ" అనే వాక్యాలు పలకాలి. అహంకార, మమకారాల నివృత్తి కొరకు ఈ విధంగా పలకటం యాజ్ఞిక ఆచారం.

**ఓం పూర్ణా పశ్చాదుత పూర్ణా పురస్తా దున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ,**
**తస్యాం దేవైః సం వసన్తో మహిత్వా నాకస్య పృష్ఠే సమిషా మదేమ ॥** (1)

**భావార్థం :** పౌర్ణమసీ దేవుడు మనకు వెనుక, ముందు మరియు మధ్యలో కూడా వ్యాపించి పూర్ణుడైయున్నాడు. సమస్త చరాచర జగత్తునకు ఆధార భూతుడైన పౌర్ణమాసీ దేవుడు వీటన్నిటికన్న గొప్పగా శ్రేష్ఠంగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆ పరమాత్మయందే సమస్త మహిమాన్విత ప్రాకృతిక దేవతలన్నీ చక్కగా నివసిస్తున్నాయి. అట్టి దేవదేవుని యోగాభ్యాసంతో సాక్షాత్కరించుకొని నాకముయొక్క పృష్ఠముపై-సుఖముయొక్క అత్యంత ఉన్నత స్థానమున ఆనందమును పొందుతూ ఆసీనులమగుదుము రండు.

**ఓం వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే,**
**స నో దదాత్వక్షితాం రయిమనుపదస్వతీమ్ ॥** (2)

**భావార్థం :** మేము సుఖములను వర్షించువాడును, అనంతబలవంతుడును అయిన సర్వశ్రేష్ఠ పౌర్ణమాసీ దేవుని పూజింతుము గాక! అతడు మాకు తరగిపోని అక్షిత సంపదల నిచ్చును గాక!

**ఓం ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా రూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం ॥**

**భావార్థం :** హే ప్రజాపతివైన పరమేశ్వరా! నీవు తప్ప మరెవ్వరును ఈ సంపూర్ణ ఆకారవంతమైన పదార్థాలను సృష్టించలేరు. వాటియందు వ్యాపించి అసలే ఉండలేరు. కనుక, మేము ఏఏ వస్తువులను కోరుతూ ఆహుతులిస్తున్నామో (పూర్ణ ప్రయత్నం చేస్తున్నామో) వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. మేము సంపదలకు స్వాములమగుదుము గాక!

**ఓం పౌర్ణమాసీ ప్రథమా యజ్ఞియాసీత్ అహ్నాం రాత్రీణామతిశర్వరేషు।**
**యే త్వాం యజ్ఞైర్యజ్ఞియే అర్ధయన్త్యమీ తే నాకే సుకృతః ప్రవిష్టాః ॥**

అథర్వవేదం (7-80-1 నుండి 4)

**భావార్థం :** మేము సదా ముందుగా పౌర్ణమాసీ దేవునే పూజింతుముగాక! స్తుతి ప్రార్థనోపాసనలను చేతుముగాక! పగలు, రాత్రి, కటిక చీకటిలో కూడా అతనినే పూజింతుము గాక! హే పూజనీయ పరమేశ్వరా! ఎవరు నిన్ను యథాయోగ్యంగా (సరియైన విధంగా) పూజిస్తారో, సత్కర్మల నాచరిస్తూ వాటి ఫలాలను నీ కర్పిస్తారో అట్టి సుకృతులంతా నాకమున - ఆనందమయ ముక్తిధామమున ప్రవేశించి చిరకాల మచట ఉంటారు.

ముక్తి యొక్క అవధి 36,000 పర్యాయాలు సృష్టి, స్థితి ప్రళయాలు జరిగినంత కాలం. అంతకాలం ముక్తజీవులు ఆనందాన్ని అనుభవిస్తూ స్వేచ్ఛగా విహరిస్తారు. కనుక మనమంతా అట్టి దేవయాన మార్గమున పయనింతము రండు.

.... శుభమస్తు .....

# పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి

ఏవిధంగా పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి ఏర్పడిందో, అట్లే పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి ఏర్పడింది. దీనికి దర్శేష్టి అని మరొక పేరు. ఏ విధంగా శుక్లపక్ష చంద్రుని వికాసంవలె పుత్రుల వికాసం ఉంటుందో, అట్లే కృష్ణపక్ష చంద్రుని హ్రాసం (క్షీణత) వలె పితరుల శరీరాలు దుర్బలములౌతాయి. కనుక ఆ సమయంలో పుత్రులు పితరుల సేవా శుశ్రూషలు చేసి పితృఋణం తీర్చుకోవాలి. లేకుంటే కృతఘ్నులౌతారు. పాపభాగులౌతారు. 'పున్నామ నరకం నుండి కాపాడేవాడే పుత్రు' డంటారు కదా! పున్నామ నరకం అంటే మరణానంతరం వెళ్లే నరకంకాదు. వృద్ధావస్థనే పున్నామనరకం అంటారు. ఆ స్థితిలో మనను ఆదరించి కాపాడుతూ ఉంటాడు కనుక పుత్రు డంటున్నారు. వయస్సు పెరిగేకొలది శరీరం శుష్కిస్తుంది. బలం ఉత్సాహం తగ్గిపోతూఉంటాయి. ఇంద్రియ శక్తులు క్షీణిస్తూఉంటాయి. కంటిచూపు, చెవివినికిడి, నడక, చేతులలో పనితనం తగ్గిపోతూ ఉంటాయి. ఎముకలలో అరుగుదలవచ్చి మోకాళ్ళ నొప్పులు, నడుంనొప్పులు కీళ్ళనొప్పులు, నరాల నొప్పులు మొదలగునవి రావచ్చు. నేడు నవనాగరికత ప్రభావం వల్ల బి.పి., షుగర్, కొలస్ట్రాల్, రక్తప్రసారలోపాలు, నరాల సమస్యలు చాలానే

బాధిస్తున్నాయి. కనుక పుత్రులు వృద్ధుల శరీరాలకు తగిన పథ్యంగా భోజనం సమకూర్చిపెట్టాలి. ఆ విధంగా వృద్ధులకొరకు ప్రత్యేకంగా చేయబడిన ఆహారాన్ని వేదం 'స్వధా' అంటుంది. 'పితృభ్యః స్వధానమః' అనే వాక్యం యజుర్వేదంలో చాలా పర్యాయాలు వస్తుంది. పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు (తండ్రి, తాత, ముత్తాతలకు) కూడా సేవా శుశ్రూషలు చేయమంటుంది వేదం. నేడునూ కొందరు మునిమనుమల సేవలను అందుకుంటున్నారు కదా! ఇక్కడ పితరులంటే కేవలం తండ్రులనే కాదు, నానమ్మలు కూడా.

మన వేదశాస్త్రాలలో 'పితర' పదం చాలా విశాలంగా చాలా అర్థాలతో కనబడుతుంది. ఎందుచేతనంటే - ఈ పదం 'పా- రక్షణే' అనే ధాతువుతో నిర్మించబడుతుంది. కనుక మనను రక్షించేవారు, మన ఉన్నతికి పాటుపడినవారు అంతా మనకు పితరులే. అందుచేతనే ఆచార్య చాణక్యులవారు...

**శ్లో॥ జనితా చ+ఉపనేతా చ యస్తు విద్యాం ప్రయచ్ఛతి,**
**అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః ॥**

తల్లిదండ్రులు, ఉపనయనంచేసి గురుకులానికి లేదా విద్యాలయాలకు పంపి చదివించినవారు, విద్యలు నేర్పిన గురువులు, ఆకలితో అలమటించకుండా అన్నంపెట్టి కాపాడినవారు, దుష్టులవల్ల భయం కలిగినప్పుడు అభయమిచ్చి కాపాడినవారు - ఈ ఐదు వర్గాలకు చెందినవారంతా పితరులే " నంటారు. ఇది వేదంచెప్పే విషయమే. పై శ్లోకంలో చాణక్యులవారు సరళంగా చెప్పారు. వీరినేకాక విద్యా విజ్ఞాన రంగాలలో కృషిచేసినవారిని, యోగసాధకులను, ధర్మోపదేశకులను, కళాకారులను, దేశంకోసం ధర్మంకోసం పాటుపడేవారినీ కూడా వేదం పితరులే నంటుంది. వీరందరిని గృహస్థులు ఆదరించి సత్కరించి వారినుండి ఉపదేశాలను, అనుభవాలను పొందమంటుంది. వీరిని శ్రద్ధతో సేవించటమే శ్రాద్ధమనీ, అనుకూలమైన ఆహారాలను ఇచ్చి తృప్తిపరచటమే తర్పణమనీ మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శ్రాద్ధ తర్పణాలు జీవించి ఉన్నవారికేకాని మృతులైనవారికి కాదు. ఆదిమ స్మృతికర్తయైన మనుమహర్షిగారు ఏమన్నారంటే -

**శ్లో ॥ కుర్యా దహరహః శ్రాద్ధమ్ అన్నాద్యేన ఉదకేన వా ।**
**పయో మూల ఫలైర్వాఽపి పితృభ్యః ప్రీతిమావహన్ ॥**- మనుస్మృతి (3-82)

"ప్రతి దినము పితరులను ఆహ్వానించి అన్న జలములతోను; పాలు, పండ్లు శాకములతోను శ్రాద్ధము చెయ్యాలి" అన్నారు, ఇవన్నీ జీవించి ఉన్నపుడు మాత్రమే సాధ్యం. చనిపోయిన తరువాత ఎలా చెయ్యగలం? వారు ఎక్కడ ఉన్నారని వాటిని పంపగలం? ఈ పొరబాటును సరిచేసుకోకపోతే మనం నవ్వులపాలవుతాం. పై వారందరిని ఆహ్వానించి సత్కరిస్తే మనకేంమిగులుతుంది అని అనుకోవద్దు. యథాశక్తి చెయ్యవచ్చు. అటువంటి యోగ్యతగల పితరులు చాలా కొద్దిమందే ఉంటారు. వారుకూడా అందరు పెట్టినది తినలేరు కదా! "Give Respect to Senior Citizens - Don't ignore their experiences " అనే నినాదాన్ని పాటించినా చాలు. ఆ ఉద్దేశ్యంతోనే ఋషులు అమావాస్యేష్టి సదాచారాన్ని ఏర్పాటు చేశారు. ఇక మనం అమావాస్యను గురించి ఆలోచిద్దాము.

అమావాస్యనాడు చంద్రుడు మనకు అసలు కనబడడు. అట్లని చంద్రుడు మాయంకాడు. ఆ రోజు అతడు సూర్యునికి తోడుగా నడుస్తూ ఉంటాడు. పగలే సూర్యునితో ఉదయిస్తాడు, సూర్యునితో అస్తమిస్తాడు. సూర్యుని తీవ్రప్రకాశం ముందు అతడు కనబడటంలేదు అంతే. ఆ రోజును మన ప్రాంతంవారు అశుభదినంగా పరిగణిస్తున్నారు కాని, కొన్ని ప్రాంతాలవారు దానిని గొప్ప సుదినంగా భావించి శుభకార్యాలు చేసుకుంటున్నారు. నిజంగా అదికూడా మంచిరోజే. ఎందుచేతనంటే ఆ రోజు పగలు సూర్యప్రకాశంతోబాటు చంద్రప్రకాశంకూడా మన భూమిమీద పడుతుంది. దాని ప్రభావం స్థావర జంగమ ప్రాణులన్నిటి మీద పడుతుంది. మూలికావైద్యులు కొన్ని మూలికలను ప్రత్యేకంగా ఆ రోజే సేకరిస్తారు. కొన్ని జంతువులలోనూ ఈ మార్పు కనబడుతుంది. కొన్ని మానసిక శారీరక రోగాలు కొందరిలో ఆ రోజు ఎక్కువకావటం, కొందరిలో ఉపశమించటం జరుగుచున్నవని శాస్త్రజ్ఞులు గుర్తించారు. కనుక మన ఋషులు ఆ రోజు దైనిక అగ్నిహోత్రంలో కొన్ని విశేష మంత్రాలతో ఆహుతులివ్వాలని నిర్దేశించారు.

**ఓం అగ్నయే స్వాహా॥ - ఇదమగ్నయే - ఇదం న మమ.**
**ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా॥ - ఇదమిన్ద్రాగ్నీభ్యామ్ - ఇదం న మమ.**
**ఓం విష్ణవే స్వాహా॥ - ఇదం విష్ణవే - ఇదం న మమ.**
**ఓం భూరగ్నయే స్వాహా॥ - ఇద మగ్నయే - ఇదం న మమ.**

**ఓం భువర్వాయవే స్వాహా॥ - ఇదం వాయవే - ఇదం న మమ.**

**ఓం స్వరాదిత్యాయ స్వాహా ॥ - ఇద మాదిత్యాయ - ఇదం న మమ.**

**ఓం భూర్ భువః స్వః అగ్ని వాయ్వాదితేభ్యః స్వాహా ॥**

**ఇద మగ్ని వాయ్వాదితేభ్య ః - ఇదం న మమ.**

పై మంత్రాలలో రెండవ మంత్రం ఒక్కటే తేడాగా ఉంది. మిగిలిన మంత్రాలన్నీ 'పౌర్ణమాస్యేష్టి వలెనే ఉన్నాయి. రెండవ మంత్రంతో ఇంద్ర+అగ్నులకు ఆహుతి ఇస్తారు. ఇంద్రుడంటే 'విద్యుత్' అని అర్థం. అంటే సృష్టిలో ఉండే స్థిరవిద్యుత్.'

ఇది అమావాస్యనాటి రాత్రి ప్రాణులను కాపాడుతున్నదని కొందరంటారు. ఇంతవరకు మనం భౌతిక అమావాస్యను గురించి చెప్పుకున్నాము. ఇక అమావాస్య దేవుని గురించి తెలుసుకుందాము.

సర్వవ్యాపకుడు, సర్వేశ్వరుడు, సృష్టిస్థితిలయకర్తయైన ఏకేశ్వరునకే అమావాస్యుడని మరొక పేరు. 'అమా' అంటే 'తోడుగా' అని అర్థం. వాస్యుడు అంటే వసించేవాడు. రెండు పదములు కలిసి అమావాస్యుడు - తోడుగా ఉండేవాడని అయ్యింది. అయినవారందరికన్న ఎక్కువగా తోడుగా ఉండేవాడు కనుక పరమేశ్వరుని అమావాస్యుడని అంటుంది వేదం. అమావాస్య రోజున చంద్రునికి సూర్యుడు తోడుగా ఉంటాడు కనుక అది భౌతిక అమావాస్య అయ్యింది. అందుచే ఆ రోజు ప్రాకృతిక దేవతలకిచ్చే ఆహుతులతో బాటు అమావాస్యాదేవునికి కూడా అథర్వవేదంలోని అమావాస్యాసూక్తంతో ఆహుతులిస్తారు కొందరు.

ఆ మంత్రాలలో చక్కటి అర్థం ఉంటుంది. పరిశీలించండి.

**ఓం యత్ తే దేవా అకృణ్వన్ భాగధేయమమావాస్యే సం వసన్తో మహిత్వా।**
**తేనా నో యజ్ఞం పిపృహి విశ్వవారే రయిం నో ధేహి సుభగే సువీరమ్ ॥**

ఓ అమావాస్యుడా! సర్వకాల సర్వావస్థలయందు మాకు తోడుగా ఉండే ఓ సర్వవ్యాపక సర్వేశ్వరా! ఏ విధంగా దేవతలు (దివ్యగుణాలు కలవారు) తమ తమ కర్తవ్యకర్మలను చక్కగా ఆచరిస్తారో, ఆ విధంగా మేమునూ వేదవిహిత పంచమహాయజ్ఞాది కర్తవ్యకర్మలను చేయుదుము గాక. ఓ విశ్వవారా! అందరిచేత కోరబడు ఓ పరమేశ్వరా! మాకు యజ్ఞములను (సత్కర్మలను) చక్కగా నెరవేర్చగల శక్తినిచ్చి వాటిని పూరింపుము. వాటి ఫలాలను ప్రసాదింపుము. ఓ సుభగా!

పరమ సౌభాగ్యవంతుడా! మాకు సువీరులతో కూడిన ధనముల నిమ్ము.

**ఓం అహమేవాస్మ్యమావాస్యా3 మామా వసన్తి సుకృతో మయీమే ।**
**మయి దేవా ఉభయే సాధ్యాశ్చేన్ద్ర జేష్ఠాః సమగచ్ఛన్తి సర్వే ॥**

అమావాస్య దేవుడు ఏమంటున్నాడంటే - ఓ మానవులారా! నేనే మీకు సదా తోడుగా ఉండే అమావాస్యుడను. నాయందే సుకృతులు సుఖాల ననుభవిస్తూ వసిస్తారు. ఉభయరకాల స్థావర జంగమ ప్రాణులునూ వాటివాటి కర్మఫలాల ననుభవిస్తూ నాయందే వసించుచున్నవి.

**ఓం ఆగన్రాత్రీ సంగమనీ వసూనామూర్జం పుష్టం వస్వా వేశయన్తీ ।**
**అమావాస్యాయై హవిషా విధేమోర్జం దుహానా పయసా న ఆగన్ ॥**

ఓ పరమేశ్వరా! నిన్ను ధ్యానిస్తూ నీ సంయోగం చేయు రాత్రి వచ్చినది. కనుక ఈ రోజు మేము విధేయతతో సత్కర్మ లనే హవిస్సులను అర్పింతుము గాక! నీవు మాకు జ్ఞానంతో కూడిన పరాక్రమాన్ని ప్రసాదించి మమ్ము తృప్తి పరుచుము.

**ఓం అమావాస్యే న త్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం ॥**

- అథర్వవేదం (7-79-1 to 4)

ఓ అమావాస్యుడా! ఈ నామ రూపాత్మక జగత్తునంతటిని ఉత్పన్నముచేసి, అన్నివైపులనుండి కప్పుచు అన్నిటినీ నీ ఒడిలో కలిగియున్న వేరొక దేవుడు లేనేలేడు. కనుక మేము కేవలం నిన్నే ఉపాసింతుము గాక. మేము ఏ ఏ కోరికలతో పూర్ణపురుషార్థం చేయుదుమో వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. నీ కృపవలన మేము అన్నిరకాల ధనాలకు - ఐశ్వర్యాలకు పతుల మగుదుము గాక. స్వాముల మగుదుము గాక!

పై మంత్రాలతో అగ్నిహోత్రంలో ఆహుతు లిచ్చేటప్పుడు మంత్రాల చివర "స్వాహా" కారం పలకాలి. అనంతరం "ఇదం అమాస్యాయై ఇదం న మమ" అనే వాక్యాన్ని ఉచ్చరించాలి. అస్తు - మనం అట్లే చేయుదుముగాక!

## యుగ గణన ఆరంభమైన దినము
# యుగాది (ఉగాది)

**"యుగాది"** అనే పదమే కాలాంతరంలో 'ఉగాది'గా ప్రచలితమయ్యింది. యుగాది అంటే యుగములకు ఆది – యుగ గణన ఆరంభమైన దినం. యుగము అంటే కొన్ని సంవత్సరాల కలయికతో ఏర్పడినదని అర్థం. మన భూమి ఒక పర్యాయం సూర్యుని చుట్టూ తిరిగి వచ్చుటకు పట్టే కాలాన్ని – **365 1/4 దినములను** సంవత్సరమన్నారు. భారతీయ జ్యోతిషశాస్త్రంలో యుగములు నాలుగు. అవి :

1) కృతయుగం (సత్యయుగం) దీని పరిమాణం – **17,28,000 సంవత్సరాలు.**
2) త్రేతాయుగం – **12,96,000 సంవత్సరాలు**
3) ద్వాపర యుగం – **8,64,000 సంవత్సరాలు**
4) కలియుగం – **4,32,000 సంవత్సరాలు**

ఈ నాలుగు యుగములు కలిసినదానిని చతుర్యుగ మంటారు. దాని పరిమాణం **43,20,000** సంవత్సరాలు. ఇట్టి చతుర్యుగాలు **1000 (వెయ్యి)** కలిస్తే ఒక సృష్టికాలమౌతుంది. అంటే ఒక సృష్టిలో 432 కోట్ల సంవత్సరాలుంటాయి. అనంతరం ప్రలయం ప్రారంభమౌతుంది. దాని పరిమాణం కూడా సృష్టికాలమంతే – **432 కోట్ల** సంవత్సరాలు. సృష్టి ప్రలయాలు దినరాత్రులవలె చక్రభ్రమణంగా వస్తూనే ఉంటాయి.

మన భారతీయ ఋషులు కాలాన్ని గణించడానికి రెండు ప్రాకృతిక పద్ధతుల నేర్పరచుకున్నారు. అవి (1) సూర్యమానము (2) చాంద్రమానము. సూర్యమానం సూర్యుని నడకను అనుసరిస్తూ లెక్కించేది. చాంద్రమాణం చంద్రుని నడక ననుసరించి గణించేది. ఈ రెండు పద్ధతులలోనూ కాంతివృత్తాన్ని ఆధారంగా చేసుకుంటారు. కాంతి వృత్తమంటే మన భూమి చుట్టూ ఉండే నక్షత్రాల వలయం. దీనిని ఖగోళ వృత్తమనియూ అనవచ్చును. గణిత శాస్త్రాన్ననుసరించి వృత్తంలో 360 డిగ్రీలు (అంశములు) ఉంటాయి. అట్లే నక్షత్రాలతో ఏర్పడిన కాంతి వృత్తంలోనూ 360 డిగ్రీలు (అంశములు) ఉంటాయి. అయినప్పటికి గణన సౌలభ్యం కొరకు ఆ వృత్తాన్ని 27 భాగాలుగా చేసి వాటికి నక్షత్రాలని పేరు పెట్టారు. వాటికి విడివిడిగా

పెట్టారు. అట్లని ఒక నక్షత్ర భాగంలో ఒకే నక్షత్ర ముండదు. 2,3,4,6 ఈ విధంగా ఎన్నైనా నక్షత్రాలుండవచ్చు. అయినప్పటికినీ ఒక నక్షత్రంగానే వ్యవహరిస్తారు.

## సూర్యమానం

ఈ పద్ధతి ననుసరించి గణించేవారు కాంతి వృత్తంలో (ఖగోళవలయంలో ఏ నక్షత్రభాగంలో సూర్యుడు ఉంటాడో ఆ కాలభాగానికి ఆ నక్షత్రం పేరుతో కార్తెలని పేరు పెట్టారు. ఉదా: అశ్వినీ కార్తె, భరణి కార్తె, కృత్తికా కార్తె మొదలగునవి. ఈ కాలం 10 నుండి 15 దినముల పరిమాణంలో ఉంటుంది. ఇంతేకాక, వీరు కాంతివృత్తాన్ని 12 భాగాలుగా చేసి వాటికి రాశులని పేరుపెట్టారు. వాటికి విడివిడిగా మేష రాశి, వృషభ రాశి, మిధున రాశి మొ॥ పేర్లు పెట్టారు. అంటే $2\frac{1}{4}$ నక్షత్రాల భాగం కలిసి ఒక రాశి అవుతుందన్నమాట. వీరు ఈ 12 రాశులనే 12 నెలలుగా వ్యవహరించారు. కాని, ప్రచండ సూర్యప్రకాశంలో నక్షత్రాలు, కాంతివలయం కనబడవు కనుక ఈ గణన సామాన్య ప్రజలకు అర్థంకాదు. అందుచే అందరకి అర్థమయ్యే చాంద్రమాణాన్ని రూపొందించవలసి వచ్చింది.

## చాంద్రమానం

చాంద్రమాన గణను తెలిసికోవటం చాలా తేలిక. రాత్రివేళ ఖగోళవలయంలో కనబడే ప్రకాశవంతమైన నక్షత్రాలను గుర్తుపెట్టుకుంటే చంద్రుడు ఏ నక్షత్రభాగంలో ఉన్నాడో చెప్పవచ్చు. లేదా పంచాంగం చూసి ఆ దినం నక్షత్రం ఏమిటో తెలిసికొని రాత్రి చంద్రుని వద్ద ఉండే నక్షత్రాలను పరిశీలించి అవి ఆ పేరుగల నక్షత్రాలని గ్రహించవచ్చు. క్రమంగా అలవాటు చేసుకుంటే పండిత పామరులందరు ప్రత్యక్ష నిదర్శనంతో వాటిని తెలుసుకోవచ్చు. ఈ చాంద్రమాన గణన ననుసరించేవారు 12 నెలలను ఏర్పాటు చేశారు. పౌర్ణమి దినమున చంద్రుడు ఏ నక్షత్ర భాగంలో ఉంటే ఆ నెలకంతకు (ముందు వచ్చిన శుక్లపక్షానికి, తదుపరి వచ్చే కృష్ణ పక్షానికి కలిపి) ఆ నక్షత్ర నామంతో పేరు పెట్టారు. ఎట్లంటే పౌర్ణమి రోజున చంద్రుడు చిత్తా నక్షత్ర భాగంలో ఉంటే అది చైత్ర మాసమని, విశాఖా నక్షత్ర భాగంలో ఉంటే వైశాఖ మాసమని ఈ విధంగా 12 నెల లేర్పడ్డాయి. అయితే ఈ మాసముల పరిమాణం 29 దినములే కావటంవల్ల సంవత్సరానికి సుమారుగా 11 దినములు తక్కువవుతాయి. అందుచే వీరు $2\frac{1}{2}$ సంవత్సరాల కొకసారి ఒక

నెలను అధిక మాసంగా లెక్కించి సూర్యమానంతో కలుపుతారు.

అశ్వనీ, భరణీ, కృత్తికా, రోహిణీ మొదలైన 27 పేర్లు మన ఆది ఋషులు కాలగణన నేవిధంగా ఆరంభించారో మన ప్రాచీన జ్యోతిష గ్రంథాలలో వ్రాసి ఉంది. ప్రసిద్ధ 'హేమాద్రి' గ్రంథంలో ....

**శ్లో॥ చైత్రే మాసి జగద్ బ్రహ్మా, ససర్జ ప్రథమేఽహని ।**
**శుక్లపక్షే సమగ్రన్తు, తదా సూర్యోదయే సతి ॥**

**భావార్థం :-** చైత్రమాస శుక్లపక్ష ప్రథమ దినమున సూర్యోదయ సమయంలో బ్రహ్మ (పరమేశ్వరుడు) జగత్ రచన (ప్రాణి సృష్టి) చేశాడు.

ప్రసిద్ధ జ్యోతిషాచార్యులు శ్రీ భాస్కరాచార్య రచిత 'సూర్యసిద్ధాన్త శిరోమణి' అనే గ్రంథంలో మరికొంత వివరంగా చెప్పబడింది.

**శ్లో॥ లంకా నగర్యాముదయాచ్చ భానోస్తస్యైవ వారం ప్రథమం బభూవ।**
**మధోః సితాదేర్దిన మాస వర్ష యుగాదికానాం యుగపత్ ప్రవృత్తిః ॥**

భావార్థం : లంకా నగరంలో సూర్యోదయ సమయము నుండి అదే వారమున అనగా రవివారమున చైత్ర శుక్లపక్ష ఆరంభ దినం నుండి దిన, వార, మాస, వర్షముల (సంవత్సరముల) గణన ఆరంభింపబడెను.

పై రెండు శ్లోకాలలో చైత్ర శుక్ల పాడ్యమి నుండి కాలగణన ఆరంభింపబడినట్లున్నది. క్రింది శ్లోకంలోని లంకా నగరం ఇప్పటి శ్రీలంక కాదు. భూమి ఏర్పడిన ప్రారంభంలో ఉత్తరార్థ గోళంలో ఒక అతి పెద్ద ద్వీపముండేది. దానికి జంబూద్వీపమని పేరు. అందులోనిదే మన భారతదేశం. ఇది అప్పుడు భూమధ్యరేఖ వరకు విస్తరించి ఉండేది. అట్టి విస్తరించి యుండెడి భారతదేశంలో సరిగా భూమధ్యరేఖపైన నేటి గ్రీనిచ్ పట్టణమువలె లంకానగర ముండేది. ఆ నగరాన్ని ఒక కేంద్రంగా చేసుకొని అక్కడి నుండి అక్షాంశ రేఖాంశాల నేర్పరచుకొని దేశాలను పట్టణాలను గుర్తించేవారు. సూర్యోదయాది వేళలు కూడా దానిని బట్టే గణించేవారు. జంబూద్వీపాది వివరాలు తెలిసికొనగోరువారు నా రచన 'మన ఇతిహాసం' చదువ గోరుచున్నాను.

చైత్ర శుక్ల పాడ్యమి నుండి కాలగణన ప్రారంభమైనదని చాంద్రామానం చెప్పుచున్నట్లే, సూర్యుడు మేష రాశిలో ప్రవేశించినప్పటి నుండి కాలగణన ప్రారంభమైనట్లు సూర్యమానం చెబుతుంది. అయితే ఈ గణన ప్రారంభమై 197 కోట్ల సంవత్సరాలకు పైగా కావటంవల్లనూ, సూర్యచంద్రుల నడకలలో (గమన వేగాలలో) వ్యత్యాసాలుండుట వల్లనూ ఈ రెండు తిథులు ఒకే దినమున వచ్చుట లేదు. సూర్యమాన సంవత్సరాది

అంటే మేష సంక్రమణం ఇప్పుడు ఏప్రిల్ నెలలో 13 లేదా 14వ తేదీన వచ్చుచున్నది. అందుచే సూర్యమానాన్ననుసరించే తమిళులు మొదలగు కొన్ని ప్రాంతాలవారు మేష సంక్రమణాన్నే సంవత్సరాది పండుగగా జరుపుకుంటున్నారు. అశ్విన్యాది కార్తెలు, ఉత్తరాయణ దక్షిణాయనాలు సూర్యుని నడకను బట్టే వస్తాయి. ఋతువులు కూడా సూర్యమానాన్ననుసరించే నిర్ణయించుకోవాలని కొందరు జ్యోతిష వేత్తలంటారు.

ఋతువులలో వసంత ఋతువు మనోహరంగా ఉంటుంది. ఎక్కువ చలిగాని వేడిగాని ఉండక సమశీతోష్ణంగా ఉంటుంది. వాతావరణంలో ఎక్కువ పొడిగాని తేమగాని లేక అన్ని శరీర తత్త్వాలకు అనుకూలంగా ఉంటుంది. ప్రకృతిలో చెట్లు చిగిర్చి పుష్పించటంవల్ల ప్రకృతి కన్నుల పండుగగా ఉంటుంది. దానిని చూసి పశుపక్ష్యాదులు కిలకిలా రావాలు చేస్తాయి. క్రొత్త మావి చివురు తిని కోయిలలు పులకించి కూతలు కూస్తాయి. అవి మనకు వీనుల విందును కలిగిస్తాయి. ఈ విధంగా సృష్టిలోని ఈ క్రొత్తదనం మన ఇంద్రియ మనోబుద్ధులకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. అందుచేతనే కవులు ఋతువులకు రాజు **వసంత ఋతువన్నారు**. ప్రకృతిలో ఈ క్రొత్తదనం నూతన సంవత్సరారంభానికి నిదర్శనంగా నిలుస్తున్నది. క్రొత్త సంవత్సరం ప్రారంభమైనట్లు ప్రకృతి సాక్ష్యమిస్తున్నది. ఆంగ్ల సంవత్సరాది జనవరి 1లో ఈ నిదర్శనాలేవీ కానరావు.

ఈ శ్రీ మన్మథ నామ సంవత్సర చైత్ర శుక్ల పాద్యమి నాటికి సృష్టికి **197,29,49,115** సంవత్సరాలు పూర్తవుతాయి. 116 వ సంవత్సరం ప్రారంభమౌతుంది. (ఇది మన్వంతరాల మధ్య ఉండే సంధికాలాలను కూడా కలిపి చెప్పిన గణన). విక్రమ శకం ప్రకారం 2071 సంవత్సరాలు పూర్తయ్యి 2072 వ సంవత్సరంలో ప్రవేశిస్తుంది.

యుగాది కాలగణన ఆరంభించిన దినమే కాక ఆదిమానవ సృష్టి యుగాది దినముననే జరిగిందనీ; అగ్ని, వాయు, ఆదిత్య, అంగిర నామక ఋషుల హృదయాలలో ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలు ప్రకాశింపబడినది కూడా యుగాదినాడేననీ విద్వాంసులంటారు. ఆ విషయాలు మనకు స్పష్టంగా తెలియకపోయినా మహర్షి దయానంద సరస్వతిగారు ఆర్యసమాజాన్ని స్థాపించినది మాత్రం యుగాది దినముననే. కనుక అది ఆర్యసమాజ స్థాపనా దినం కూడా.

197 కోట్ల సుదీర్ఘ చరిత్ర కలిగిన మన వేదమతం కాలప్రవాహంలో

అనేకానేక ఒడిదుడుకులకు గురి అయ్యింది. ముఖ్యంగా విదేశీయులు విమతస్థులునైన మహమ్మదీయుల క్రైస్తవుల పాలనలో చాలా కష్టాల నెదుర్కొన వలసివచ్చింది. ధార్మిక క్షేత్రంలో చాలా అవనతికి గురయ్యింది. ఏకేశ్వరోపాసన స్థానంలో అనేక దేవీదేవతల ఉపాసనలు ప్రారంభమయ్యాయి. జాతి అనేక సంప్రదాయములుగా విడిపోయి పరస్పర కలహాలతో అశాంతికి గురిఅయ్యింది. అట్టి స్థితి నుండి మన వేదమతాన్ని ఉద్ధరించటానికే మహర్షి దయానంద సరస్వతులవారు ఆర్యసమాజాన్ని స్థాపించి విశుద్ధ వైదిక ధర్మ ప్రచారం చెయ్యమని ఆదేశించారు. ఆనాటి నుండి ఈనాటి వరకు ఆర్యసమాజం హేతుబద్ధమైన విజ్ఞాన సమ్మతమైన వేద సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నది. భవిష్యత్తులో కూడా ఇట్లే చేస్తూ ఉంటుంది. అస్తు.

మీ అందరికి మా 'మన్మథ' నామ సంవత్సర శుభాకాంక్షలు.

## శ్రీరామనవమి (చైత్ర శు.నవమి)

# ఒకే బాణము, ఒకటే మాట, ఒకే పత్ని - అతడే శ్రీ రాముడు

మహర్షి నారదుని ఉపదేశంతో వాల్మీకి కఠోర తపస్సును గావించి ఋషి స్థానము నధిరోహించెను. 'శూద్రోబ్రాహ్మణతా మేతి - శూద్రుడు విద్యా సదాచారముల వలన బ్రాహ్మణత్వము నందు' నను మనుమహర్షి మనుస్మృతి (10-65) వచనాలను సార్థకం చేసెను. ధనంకొరకు స్త్రీ బాల వృద్ధులనుకూడ హత్యగావించ వెనుకాడని ఆ కఠోర హృదయం ఒక పక్షి మరణాన్ని చూచి ద్రవించి పోయెను. ఆ పరితప్త హృదయగర్భం నుండి ఒక ఆవేదనారాగ మావిర్భవించెను. అదియే ఛందోబద్ధమై కమనీయ రామాయణకావ్య మయ్యెను. యుగములు గడిచిపోయినా నిత్యనూతన మగుచు ఇప్పటికిని గాన, నృత్య, నాటకాదుల రూపమున ప్రజల హృదయాలను రంజింపజేయుచునే యున్నది. మరి, ఆ రామాయణంలోని ఔన్నత్యమేమి? శ్రీరాము డంతటి గొప్పవాడా? అతనిలోని వైశిష్ట్య మేమి? అని ప్రశ్నించుకున్న అతి క్లుప్తంగ - ఒకే బాణము, ఒకటే మాట, ఒకే పత్ని - అతడే శ్రీరాముడని సమాధానం వచ్చును.

ఒకే బాణము :- పువ్వు పుట్టగనే పరిమళించు నను లోకోక్తిగా బాల్యమునసే

శ్రీరాము దద్వితీయ పరాక్రమ వంతుడై వెలుగొందెను. అతని బలవీర్యాలు గుర్తించియే విశ్వామిత్రుడు తన యాగ రక్షణకు అజేయుడని ప్రసిద్ధిగాంచిన దశరథుని కాదని శ్రీరాముని కోరుకొనెను. తాటకిని, మరీచ సుబాహులను ఒక్కొక్క బాణంతోనే పడగొట్టి విశ్వామిత్రుని నమ్మకాన్ని యథార్థం చేసెను. ఎంతో కాలంగా వీరాధివీరులు కూడ ఎత్తి ఎక్కుపెట్టలేని శివధనుస్సును అవలీలగా ఎత్తుటయేగాక, నారిని బిగించుచునే విరుగగొట్టగలిగిన అద్వితీయ బలశాలి శ్రీరాముడు. నా కుమార్తె 'వీర్యశుల్క - బలమునే కన్యాశుల్కంగా కోరుచున్నానని ప్రతిజ్ఞ గావించిన జనకుని ప్రతిజ్ఞను సత్యం (సార్థకం) చేసెను. పెక్కురు రాజన్యులను పరాభవించిన పరశురాముని క్షణంలో నిర్వీర్యుని చేసెను. "ఓ రామ! నీవు అతి బలశాలియైన వాలిని చంపగలవో లేదోనని నా కనుమానముగా నున్నది - సాల మేకం నిర్భంధ్యా భవే ద్వ్యక్తి ర్బలాబలే" - నీ బాణముతో ఒక సాలవృక్షమును పడగొట్టిన నీ బలముపై నాకు విశ్వాసము కలుగు' నన్న సుగ్రీవుని వచనములకు ప్రసన్నుడై రాముడు వింటిని సారించి ఒక్క బాణం వేయగా -"

**స విసృష్టో బలవతా బాణః స్వర్ణ పరిష్కృతః ।**
**భిత్వా సాలాన్ గిరి ప్రస్థం సప్త భూమిం వివేశ హ ॥**

(వాల్మీకి రామాయణము. కిష్కింధ. 12-3)

అద్వితీయ బలవంతుడైన రాముడు విడిచిన ఆ సువర్ణాలంకృత బాణము వరుసగానున్న ఏడు సాలవృక్షాలను పడగొట్టి కొండ కొనను చీల్చి భూమిలో ప్రవేశించెను.

ఒకటి కాదు రెండు కాదు ఏడు సాల వృక్షములను ఒకే ఒక్క బాణంతో కూలగొట్టిన రాముడెంతటి బలవంతుడో, అతని బాణ మెంతటి శక్తి వంతమో ఆలోచించుడు. అట్లే, ఒకే ఒక బాణంతో అతిబలశాలియైన వాలిని సంహరించెను. ఇక రామరావణ యుద్ధమున రావణుడు రాముని ప్రతాపము ముందు నిలువలేక విరథుడై, నిరాయుధుడై, అసహాయుడై ఒంటరిగా చిక్కినను ధర్మాత్ముడైన రాముడు అతనిని సంహరింపక 'అలసట తీర్చుకొని రథముతో, అస్త్రశస్త్రములతో రేపు తిరిగి రమ్మని' పంపిన అత్యంత ధర్మయోధుడు శ్రీరాముడు. రామరావణ యుద్ధమును గూర్చి వర్ణించి వర్ణించి ఇక మాటలు అందక వాల్మీకి ఆ యుద్ధము నిట్లు వర్ణించెను.

**"గగనం గగనాకారం సాగరం సాగరోపమః ।**
**రామరావణయోర్యుద్ధం రామ రావణయో రివ ॥**

(వాల్మీకి రామాయణం. యుద్ధకాండ. 110-24)

ఎట్లు గగనమును పోల్చ గగనము, సాగరమును పోల్చ సాగరము తక్క మరియొక ఉపమానము లేదో అట్లే రామరావణుల యుద్ధమును పోల్చ రామరావణుల యుద్ధము తక్క మరియొక ఉపమానమే లేదు" అన్నారు.

మరునాడు రావణుడు రాముని రథధ్వజమును కూలగొట్ట ఎన్నెన్నో బాణములు వేసినను మధ్యలోనే రాముడు వాటిని ఖండించెను. కాని, రాముడు వేసిన ఒకే ఒక బాణముతో రావణుని రథధ్వజము నేలకూలెను. తదుపరి జరిగిన ఘోరమైన ద్వంద్వ యుద్ధంలో చివరకు క్రోధితుడై శ్రీరాముడు విడిచిన బ్రహ్మాస్త్రంతో - ఒకే బాణంతో - రామ బాణంతో రావణుని హృదయం ఛేదింపబడి నేలకూలెను. గాన, ఒకే బాణ మనగానే రామబాణమని గుర్తుకు వచ్చును.

<u>**ఒకటే మాట :-**</u> శ్రీ రామునిలోని మరియొక విశేషత - ఆడిన మాట తప్పని ధర్మనిష్ఠ. ఎన్ని కష్టము లెదురైనా అత డాడిన మాట యెప్పుడును తప్పలేదు! <u>'రామో ద్విర్నాభి భాషతే'</u> - రాముడు రెండు మాటలు మాట్లాడడు. అన్నదానినే చేయు నని కైకేయితో అన్న మాటలు జీవిత మంతయు పాటించెను. మరొక సందర్భమున సీతతో -

**అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్ ।**
**న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥**

(వా.రా. అరణ్య. 10-19)

'నేను నా ప్రాణములు విడువవలసి వచ్చినా లేక నిన్ను (సీతను), లక్ష్మణుని విడువ వలసి వచ్చినా సరే, కాని నా ప్రతిజ్ఞను - అన్న మాటను విడువజాల' నని పలికెను. అట్లే ఆచరించెను. మరియొక సందర్భమున విభీషణునికి అభయ మిచ్చుచు-

**అహత్వా రావణం సంఖ్యే సపుత్రబలబాంధవమ్ ।**
**అయోధ్యాం న ప్రవేక్ష్యామి త్రిభి స్తైర్భ్రాతృభి శ్శపే ॥**

(వా.రా.యుద్ధ. 19-22)

'ఓ విభీషణా! రణమున పుత్ర బంధు సైన్యసమేతముగ రావణుని వధింపక

నే నయోధ్యలో ప్రవేశింపను. నా ముగ్గురు తమ్ములమీద శపథము చేయుచున్నా' నని పలికి వెంటనే లక్ష్మణునితో సముద్ర జలమును తెప్పించి విభీషణుని రాక్షస రాజుగ అభిషేకించెను. చేసిన శపథమును నెర వేర్చియే అయోధ్యలో ప్రవేశించెను.

<u>ఒకే పత్ని :-</u> చరిత్రలో మనకెందరెందరో పతివ్రతల కథలు కనబడును. వారు చేసిన త్యాగముల గూర్చి కవులు చేసిన వర్ణన లసంఖ్యాకములు. కాని, పత్నీ వ్రతుల - పరస్త్రీని కన్నతల్లివలె మనసా వాచా కర్మణా భావించగలవారి చరిత్రలు బహు అరుదు. అట్టి ఏక పత్నీవ్రతులలో గూడ శ్రీ రాముడే అగ్రగణ్యుడు. అద్వితీయుడు (అట్టి ఏకపత్నీవ్రతుడు మరియొకడు లేడు) అన్నను అతిశయోక్తి గాదు. సీతాపహరాణానంతరము దండకారణ్యమున రాముడు విలపించినతీరు చూచిన అట్టి భార్యానురాగి మరియొకడుండునా? అనిపించును. భార్యా వియోగమున బొందిన ఆ పరితాపమును చూచిన రాముడంతటి వీరుడు, ధీరుడు ఇట్టి బేల కానేల ననిపించును. కానీ, వేదాదేశమే అటులున్నది -

**ఇహే మావిన్ద్ర సం నుద చక్రవాకేవ దంపతీ ।**
**ప్రజయైనౌ స్వస్తకౌ విశ్వమాయుర్ వ్యశ్నుతామ్ ॥**

(అథర్వ వేదం (14-2-64))

భార్యాభర్తలు చక్రవాక పక్షుల జంటవలె గాఢానురాగబద్ధులై గృహస్థ జీవితమును గడుపుమని పరమేశ్వరుని ఉపదేశం. చక్రవాక పక్షులకు రాత్రులందు చూపుకానరాదట. అందుచే మగ ఆడ పక్షులు ఒకదానినొకటి చూచుకొనలేక ఎటోపోయి నట్లు తలచి అత్యంత విరహవేదన ననుభవించునట. రాత్రంతయూ అట్లే గడిపి తెల్లవారగనే ఒకదాని నొకటి చూచుకొని అత్యంత ప్రసన్నత నొందునట. పశుపక్ష్యాదులలో ఇట్టి యనురాగం బహు అరుదుకాగా, ఇందుకు భిన్నంగా చక్రవాక పక్షులలో అత్యంత ఉన్నతముగా కనబడును. ఇది ఈశ్వర సృష్టి వైచిత్ర్యము. అట్టి చక్రవాక పక్షిజంటనే ఉపమానముగా జూపి పరమేశ్వరుడు దంపతుల కొరకు పై ఉపదేశము చేసెను. ఆ ఉపదేశమునే రాముడు జీర్ణంచుకొనెను. వేదములందు ఇట్టి మరెన్నో ఉపమానములు కలవు. మరియొక చోట వేద భగవానుడు -

**"ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్,**
**క్రీడంతౌ పుత్రై ర్నప్తృ భి ర్మోదమానౌ స్వస్తకౌ"**

(అథర్వ వేదం (14-1-22))

"ఓ దంపతులారా! మీరిరువురు ఈ గృహస్థాశ్రమమున స్థిరముగా నుండుడు. ఎన్నడూ వియుక్తులు కావలదు (విడిపోవలదు). పుత్ర పౌత్రాదులతో పరమానందము ననుభవించుచు పూర్ణాయువు ననుభవింపుడు" అని ఉపదేశించెను.

గాన, అనురాగబద్ధులు పరస్పర వియోగమున వేదన ననుభవించుట సహజమే. వియోగమున స్త్రీలు ఎంతగా వేదన ననుభవింతురో పురుషులు కూడ అంతటి వేదన నొందుట ఆవశ్యకమే. ఇంతేగాక, ఇది శ్రీరాముని పత్నీవ్రతమునకు ఒక గీటు రాయిగ నున్నది.

అందుచేతనే వేదానుయాయుడైన శ్రీరాముడు భార్యను అంతగా ప్రేమించెను. అట్టి భార్య జాడ తెలియనందున నిద్రాహారాలు కూడ మరిచి విలపించెను. లంకలో సీతను చూచి హనుమంతుడు రాముని విరహ వేదనను ఇట్లు వర్ణించెను–

**నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోకపరాయణః ।**
**నాన్య చ్చింతయతే కించిత సతు కామవశం గతః ॥**
**అనిద్ర స్సతతం రామ స్సుప్తోఽపి చ నరోత్తమః।**
**సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే ॥**

**దృష్ట్వా ఫలం వా పుష్పం వా యద్వాఽన్యత్సుమనోహరం,**
**బహుశో హా ప్రియే త్యేవం శంసం స్త్వా మభిభాషతే.**

(వా.రా. సుందర. 36–43,44,45)

"ఓ సీతమ్మ తల్లీ! రాముడెల్ల వేళల నిన్నే తలంచుచున్నాడు. నీకై శోకించుచున్నాడు. వేరేమియు ఆలోచించుటయే లేదు. నిదురించుట లేదు. ఆ పురుషోత్తము డొకప్పుడు నిద్రించినను అకస్మాత్తుగ 'సీతా!' యని మధురముగా పలుకుచు మేల్కాంచుచున్నాడు. పండునుగాని, పువ్వునుగాని లేక సుందరమగు మరేవస్తువునుగాని చూచి 'హా! ప్రియా' అని నిన్నే స్మరించుచున్నాడు."

పై హనుమంతుని వచనముల వలన రాముడెంతగా సీతను ప్రేమించెనో తెలియనగును. అందుచేతనే ఒకే పత్నియనగానే మన స్మృతిపథమున మెదలాడు మొదటి వ్యక్తి శ్రీరాముడే.

గాన, ఇప్పటికైనా శ్రీరాముని బొమ్మల నారాధించుట మాని అతని చరిత్ర

ననుసరింతము రండు. సీతాకల్యాణములు మాని లోకకల్యాణము చేతము రండు. తన జీవితంలో ఒకేసారి వివాహం జరిగిన సీతమ్మకు మరల మరల వివాహాలు చేయనేల? దుఃఖిత పీడిత అభాగ్య సోదరీమణుల వివాహములు చేయ ప్రయత్నింతము రండు.

కొన్ని సంవత్సరముల క్రిందటి పత్రికావార్త యేమనగా – రష్యా దేశంలో ఒక నాటక బృందము ప్రజలకోరిక మేరకు కొన్ని సంవత్సరములనుండి విడువకుండ రామాయణ నాటకమునే ప్రదర్శించుచున్నదట. ఆ నాటకమును ప్రజలు ఎన్నిసార్లు చూసినను తనివి తీరుటలేదట. అందు రాముని పాత్ర పోషించువ్యక్తి కొన్ని సంవత్సరములుగా ఆ పాత్రను పోషించుచుండుట వలన, వేష సంభాషణ భావ ప్రకటనాదుల వలన అతనిలో అద్భుతమైన మార్పు కలిగెనట. అతనికి 35 సంవత్సరములు దాటిపోవుచున్నను వివాహము చేసుకొనక పట్టణానికి దూరంగా ఏకాంత ప్రదేశంలో ఒక కుటీరాన్ని నిర్మించు కొని అందు వసించుచున్నాడట. మద్యమాంసాదులను విడిచిపెట్టి పూర్తి శాకాహారమునే భుజించుచు తాపసివలె నిరాడంబర జీవితాన్ని గడుపుచున్నాడట. కొందరు పత్రికా విలేకరులు అతని వివరములడుగుచు మీరింతవరకు వివాహము చేసుకోలేదేమని ప్రశ్నించగా అందుకు ఆ వ్యక్తి సీతవంటి స్త్రీ ఇంతవరకు దొరకనందున చేసుకోలేదని ప్రత్యుత్తరమిచ్చెనట. అదే వార్తను విలేకరులు పత్రికలలో ప్రచురించుట జరిగెను. చూచితిరా! రామాయణ కథా ప్రభావ మెంతటిదో! ఈ ఆశయముతోనే వాల్మీకి తరతరాలు యుగయుగాలు మానవజాతి అనుసరించదగిన సకల సద్గుణాభిరాముని చరిత్రను వ్రాసి లోకమున కందించెను.

**ప్రతి ఇంటా తప్పక ఉండవలసిన గ్రంథం "వాల్మీకి రామాయణం".**

# వజ్రాంగబలి శ్రీ వీర హనుమంతుడు నవవ్యాకరణ పండితుడు కూడా.

హనుమజ్జయంతి (వైశాఖ బ. దశమి)

<u>అగస్త్యమహర్షి ఉవాచః</u>

శ్లో. సర్వాసు విద్యాసు తపోవిధానే
ప్రస్పర్థతే యోహి గురుం సురాణామ్ ।
సోఽయం నవవ్యాకరణార్థవేత్తా
బ్రహ్మా భవిష్యత్యపి తే ప్రసాదమ్ ॥

- వాల్మీకి రామాయణం ఉత్తరకాండం (36-47)

తా॥ హనుమంతుడు సకల విద్యలలోను, తపోవిధానాలలోను దేవగురువైన బృహస్పతివంటివాడు. నవవ్యాకరణ సిద్ధాంతాలను పుక్కిట పట్టినవాడు. ఓరామా! నీ అనుగ్రహమున ఇతడు రాబోవు కల్పమునందు 'బ్రహ్మ' కాగలడు. (బ్రహ్మ - అంటే ఆదిమ చతుర్వేదవేత్త).

శ్రీరామ భక్త వీరహనుమంతుడు ధీరుడు, వీరుడు, స్వామి భక్తుడు, దేశ భక్తుడు, ధర్మ భక్తుడేగాక గొప్ప ధీశాలి. వేదవేదాంగాలను అధ్యయనం చేసినవాడు. వైదిక వ్యాకరణం పట్ల ఆయనకు అభిరుచి మెండు. అందుచే ఆయన ఆ కాలంలోని 9 (తొమ్మిది) వ్యాకరణ శాస్త్రాలను అధ్యయనం చేసిన నవవ్యాకరణ విశారదుడు. ఇందుకు శ్రీవాల్మీకి మహర్షి వ్రాసిన రామాయణమే గొప్ప సాక్ష్యం. ఆ మహర్షి తమ రామాయణ కావ్యంలోని కిష్కింధాకాండలో మన వీరాంజనేయుని పాండిత్య ప్రతిభను శ్రీరాముని వాక్యాలలోనే పేర్కొన్నారు.

రావణుడు సీత నపహరించిన తరువాత శ్రీరాముడు మిక్కిలిగా విలపిస్తూ సీతాన్వేషణ కొరకు బయలుదేరాడు. రావణాసురు డామెను దక్షిణం వైపుగా తీసుకుపోయినట్లు తెలిసి దక్షిణ భారతావనిలో వెదుకుతూ, వెదుకుతూ పంపాసరోవర తీరానికి చేరుకున్నాడు. లక్ష్మణుడు అన్నను అనుసరించాడు. వారిరువురు ఋష్యమూక పర్వత ప్రాంతానికి చేరుకున్నారు. అదే ఋష్యమూక పర్వతంపై అన్న వాలి చేసిన అన్యాయానికి గురియైన సుగ్రీవుడు తలదాచుకుంటూవున్నాడు. దూరం నుండి శ్రీరామ లక్ష్మణులను చూచిన సుగ్రీవునకు అనుమానం, భయం కలిగాయి. వారిరువురు

వాలి పంపిన గూఢచారులో, సేనాపతులో అయిఉంటారని అతని అనుమానం. వాలి తనకన్న బలవంతుడు కనుక అతనిపట్ల భయం. అందుచే తన అనుచరులుగాఉన్న నలుగురు మంత్రులను సమావేశపరచి ఆలోచించసాగాడు. రామలక్ష్మణు లిరువురు నారవస్త్రాలు ధరించి జటాఝూటాలతో మునులవలె ఉన్నా, వారి ముఖాలలో క్షాత్రతేజం, చేతులలో ధనుర్బాణాలు ఉన్నాయి. కండలు తేరిన వారి విశాల బాహువులను చూచి మరింతగా బయపడ్డారు. 'నా క్షేమాన్ని కోరే ఓ మంత్రులారా! ఆ మహాయోధులను చూశారా! వారిని మా అన్న వాలియే నన్ను చంపటానికి పంపి ఉంటాడు. వారు మునుల వేషంలో దగ్గరగా వచ్చి నన్ను చంపుతారేమో! మనం పారిపోవటం మంచిది' అన్నాడు సుగ్రీవుడు. హనుమంతునికి తప్ప మిగిలిన మంత్రులకు, అనుచరులకు కూడా అదే భయం కలిగింది.

అప్పుడు వివేకవంతుడైన హనుమంతుడు మీరు భయపడకండి; తొందరపడి పారిపోకండి. నేను ఒక్కడినే వారి వద్దకు వెళ్ళి వారి విషయం తెలుసుకు వస్తానన్నాడు. అందరూ సరేనని హనుమంతుడిని దూతగా వారి వద్దకు పంపారు. హనుమంతుడు భిక్షు వేషంతో (సాధువుగా) వారి వద్దకు వెళ్లి రాయబారం జరిపినట్లు వాల్మీకి మహర్షి వ్రాశారు. అన్ని విషయాలు మాట్లాడుకున్న తరువాత శ్రీరాముడు లక్ష్మణునితో హనుమంతుని సభ్యతా సంస్కృతుల గురించి, విద్యా వినయాల గురించి, పాండిత్య ప్రతిభను గురించి, వ్యవహార కుశలత గురించి ఈ క్రింది విధంగా కొనియాడాడు.

**శ్లో॥ తమభ్యభాష సౌమిత్రే సుగ్రీవసచివం కపిమ్ ।**
**వాక్యజ్ఞం మధురైర్వాక్యైః స్నేహయుక్త మరిన్దమమ్ ॥ (27)**

ఓ లక్ష్మణా ! సుగ్రీవుని మంత్రియైన ఈ హనుమంతుడు వాక్య విశారదుడు. శత్రుదమన నేర్పరి. నా యందును, సుగ్రీవుని యందును స్నేహభావం కలవాడు. కనుక నీవు ఇతనితో కఠినంగా మాట్లాడకు. మధురంగా మాట్లాడు.

**శ్లో॥ నాఽనృగ్వేద వినీతస్య నాఽయజుర్వేద ధారిణః ।**
**నాఽసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుమ్ ॥ (28)**

ఈ హనుమంతుడు గొప్ప విద్వాంసుడు. ఏలనన ఋగ్వేద అధ్యయనంచేసిన వాడుగాని, యజుర్వేదం ధరించినవాడు గాని, సామవేదజ్ఞుడు గాని కాకున్నచో ఇంత పరిష్కృతమైన పలుకులు పలుకలేడు.

**శ్లో॥ నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా(శ్రుతమ్ ।**
**బహు వ్యాహరతానేన న కిఞ్చిదప శబ్దితమ్ ॥ (29)**

ఇతడు అనేక పర్యాయములు వ్యాకరణం చదివిన వాడు కావచ్చు. (నవ విధ వ్యాకరణాలు అధ్యయనం చేసి ఉండవచ్చు) కనుకనే ఇంతసేపు మాట్లాడినా ఒక్క వ్యాకరణ దోషంకూడా కనబడుటలేదు.

**శ్లో॥ న ముఖే నేత్రయోర్వాపి లలాటేచ భ్రువోస్తథా ।**
**అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్ ॥ (30)**

ఇంతేగాక, అతను మాట్లాడేటప్పుడు అతని ముఖంలో ఎట్టి వికారం కలుగలేదు. శరీరంలోని ఇతరావయవాలలోనూ వికార దోషాలు కలుగలేదు. కనుక ఇతడు చాలా గొప్ప విద్వాంసుడు.

**శ్లో॥ అవిస్తర మసందిగ్ధమవిలంబిత మద్రుతమ్ ।**
**ఊరః స్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే ॥ (31)**

ఓ లక్ష్మణా! ఈ హనుమంతుడు చాల సభ్యుడు. ఈతని సంభాషణ (రాయబారం) సంక్షిప్తం. సందేహరహితం (విస్పష్టం). విషయ విశ్లేషణలో తొందరపాటుగాని, ఆలస్యంగాని లేదు. కంఠస్వరం బిగ్గరగాగాని, మందంగాగాని లేదు. మధ్యమ స్వరంలో వినసొంపుగా ఉంది.

**శ్లో॥ సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితామ్ ।**
**ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీమ్ ॥ (32)**

ఇతని వాణి వ్యాకరణంతో సంస్కరింపబడినదై, తీక్షణంగాగాని, మందంగాగాని లేకుండా ఒక క్రమంతో ఉంది. ఇతని వాణి (పలుకులు) కళ్యాణకరం. హృదయాకర్షకం. మరల మరల వినాలనిపిస్తున్నది.

**శ్లో॥ అనయా చిత్రయా వాచా త్రిస్థాన వ్యఞ్జనస్థయా ।**
**కస్య నాఽ రాధ్యతే చిత్తముద్యతాసేరరేరపి ॥ (33)**

ఆశ్చర్యము కలిగించునదియు, వక్షస్థల కంఠ ముఖములనుండి వెడలు ఈతని రమణీయ వాణి ఉదాత్త అనుదాత్త స్వరితములతో కూడినదై వినసొంపుగా ఉంది. చంపుటకై కత్తినెత్తిన శత్రువునకైనా మానసోల్లాసం కలిగించేదిగా ఉంది.

**శ్లో॥ ఏవం విధో యస్య దూతో న భవేత్పార్థివస్య తు ।**
**సిధ్యన్తి హి కథం తస్య కార్యాణాం గతయోఽ నఘ ॥ (35)**

**శ్లో॥ ఏవం గుణగుణై ర్యుక్తా యస్య సుః కార్యసాధకాః ।**
**తస్యసిద్ధ్యంతి సర్వార్థా దూతవాక్య ప్రచోదితాః ॥ (36)**

ఓ అనఘా! పాపరహిత లక్ష్మణా! ఇట్టి సద్గుణ సంపన్నులు, వాక్య విశారదులు, చతురులునైన దూతలను (రాయబారులను) గల రాజులు ధన్యులు. ఆ రాజు యొక్క కార్యాలన్నీ ఇట్టి దూతల వాక్కౌశలం చేతనే సిద్ధిస్తాయి. అనాయసంగా వారికి విజయం చేకూరుతుంది" అని శ్రీరాముడు కొనియాడాడు.

- వాల్మీకి రామాయణం (3 వ సర్గం - 28 నుండి 36) శ్లోకాలు.

వేదాలను కేవలం చదువుకుంటూ వెళ్లిపోవటం కాదు. సాంగోపాంగంగా వేదాధ్యయనం చేయాలంటారు ఋషులు. శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛందో, జ్యోతిషాలని అంగాలు ఆరు. 'న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంతము' లని ఉపాంగాలు ఆరు ఉంటాయి. వీటిలో మొదటిదైన శిక్షా శాస్త్రమే అన్నింటికి పునాది వంటిదని శాస్త్రాలు చెబుతాయి. ఏ అక్షరాన్ని ఏ స్థానంనుండి ఏఏ ప్రయత్నాలతో ఉచ్చరించాలో ఆ శాస్త్రంలో చెప్పబడతాయి. ఇంతేగాక, పలికే పలుకులలోకూడా 14 రకాల దోషాలు వచ్చే అవకాశం ఉంటుందట. అట్టి దోషాలు లేకుండా, ఇంద్రియాలలో ఎట్టి వికారాలు కలుగకుండా స్పష్టంగాను, సంక్షిప్తంగాను, సందేహరహితంగాను మాట్లాడాలి. అట్టి మెలుకవలన్నీ హనుమంతునిలో చూచినాడు కనుకనే శ్రీరాముడు అతనిని అంతగా ప్రశంసించినాడు. శ్రీ రాముడును అంతటి విద్వాంసుడే. లేకున్న అతని ప్రతిభను గుర్తించలేడు. అంతటి వ్యాకరణ పండితుణ్ణి కోతిగా వర్ణించటం, చిత్రించటం మంచిదికాదు. వానరులు సూర్యవంశ క్షత్రియజాతినుండి విడిపోయిన ఒక ఉపశాఖ. వారంతా క్షత్రియులే.

వాలి సంధ్యావందనం చేసినట్లుగా, వాలి మరణానంతరం అంత్యేష్టి సంస్కారం జరిపించి కుమారుడైన అంగదునకు నూతన యజ్ఞోపవీత ధారణ చేయించినట్లు **"తతోఽవిన్ విధి వద్వాపోఽప సవ్యంచ కారహ"** అనే మాటలు వాల్మీకి రామాయణంలో (కిష్కింధాకాండలో) ఉన్నాయి. హనుమంతుడు పురోహితునిగా ఉండి, శ్రీరామ సుగ్రీవుల మైత్రీప్రతిజ్ఞ అగ్నిహోత్రవిధి పూర్వకంగా జరిపినట్లు స్పష్టంగా ఉంది. లోక ప్రసిద్ధమైన హనుమాన్ చాలీసా లోని **"కాంధే మూంజ్ జనే ఉ ఛాజై"** అనే మాటలే హనుమంతుడు యజ్ఞోపవీత ధారియని, ద్విజుడనీ వేద

వేదాంగవేత్తయనీ స్పష్టంగా చెబుతున్నాయి. కోతులు యజ్ఞోపవీతం ధరిస్తాయా? సంధ్యాగ్నిహోత్రాలు చేస్తాయా ? వానరులలో పురుషులే గాక స్త్రీలు కూడా వేదవేత్తలుగా ఉండేవారు. వాలి భార్య తార గొప్ప విదుషీమణి. వాల్మీకి రామాయణ కిష్కింధాకాండలో ఆమె వ్యవహారం, ఉపదేశాలు చదివితే ఆమె గొప్ప రాజనీతిజ్ఞురాలని కూడా బోధపడుతుంది. సుగ్రీవుడు రెండవసారి యుద్ధానికి లలకారం చేసినప్పుడు ఆమె చాలా వారిస్తుంది. అయినా వాలి వినకపోతే వీరగంధం పూసి, తిలకం దిద్ది, వేదమంత్రాలతో స్వస్తివాచనం పఠించి పంపిస్తుంది. ఆమె అట్టి వీరాంగన కూడా. హనుమంతుని తల్లి అంజనా దేవియును గొప్ప విదుషీ, వీరాంగన.

వీరాంజనేయుని తల్లిదండ్రులైన అంజనీపవను లిరువురు సుక్షత్రియులే. ఆనాడు రావణాసురుని అరాచకాల నడ్డుకోవటానికి పూర్ణప్రయత్నం చేసినవారే. వారి సంస్కారాలే ఆంజనేయునిలో మరింత వికసించాయి.

"వానర" అంటే కేవలం కోతియని మాత్రమే అర్థంకాదు. వనవాసులను కూడా వానరులంటారు. సృష్ట్యాదిలో దక్షిణ భారతదేశమంతా దట్టమైన అడవులతో నిండి ఉండేది. మానవులు ఎవరూ ఉండేవారు కాదు. గంగా సింధుమైదానం నుండి కొందరు ఆర్యులు ఇక్కడకు చేరుకొని వ్యవసాయాదులు చేసుకుంటూ దీనిని అభివృద్ధి పరచారు. క్రమంగా గ్రామాలు, పట్టణాలు, నగరాలు కూడా తయారయ్యాయి. రామయణకాలం నాటికి కిష్కింధ పెద్దరాజ్యం. విద్యా విజ్ఞానాలతో, సిరిసంపదలతో, బలవీర్యాలతో లంకా నగరానికి మించిన రాజ్యంగా అది ఉండేది. వాలి సుగ్రీవు లిరువురు బలవీర్య శౌర్యపరాక్రమాలలో రావణుని మించినవారుగా ఉండేవారు. కనుకనే రావణుడు భారతదేశాన్ని ఆక్రమించకుండా ఆపగలిగేరు.

అట్లే – 'లాంగులమ్' అంటే కేవలం 'తోక' యనియే అర్థం కాదు. వేదాలలో ఈ పదం కనపడుతుంది. అక్కడ లాంగులమ్ అంటే నాగటి కొఱ్ఱు (మొన) అని అర్థం. లాంగులమ్ అనే పదానికి మగసిరి (పురుష మర్మేంద్రియం) అని కూడా అర్థం ఉంది. కనుక వానరులు తమ నడుములకు మగసిరికి, పౌరుషానికి చిహ్నంగా ఒక నాగటి కొఱ్ఱు వంటి ఆభూషణం ఏదో ధరించేవారు, అని అర్థం చేసుకోవాలి.

అంతేగాక, హనుమంతుడు, భీష్మపితామహుని వంటి అస్ఖలిత బ్రహ్మచారి. శ్రీకృష్ణునివంటి బ్రాహ్మీక్షాత్ర శక్తుల పరిపూర్ణరూపం. ఆయన అనుసరించిన

వ్యవహారనీతి, కార్యదీక్ష, కర్తవ్యపరాయణత అందరూ అనుసరించతగినవి. ముఖ్యంగా నేటి యువతకు హనుమంతుని జీవితాన్నుండి నేర్చుకోవలసిన వ్యక్తిత్వ పాఠాలు చాలానే ఉన్నాయి.

ఎందుచేతనో మన పిచ్చి భక్తులు మహాపురుషుల జీవితాలను అనుసరించటం ప్రక్కకు పెట్టి వారికి మరికొన్ని మహత్తులను అంటగట్టాలని కట్టుకథల నెన్నిటినో వ్రాసి ప్రచారం చేశారు. అవి వారి మహత్తులను పెంచకపోగా వారి నిజమైన చరిత్రలనే కట్టుకథలను చేశాయి. యుక్తి సంగతము, విజ్ఞాన సమ్మతము కాని, సృష్టిక్రమానికే విరుద్ధమైన ఆ కథలు మన మహాపురుషులను నవ్వులపాలు చేస్తున్నాయి. మన హనుమంతుని విషయంలోనూ అదేజరిగింది. అతని తండ్రి వాయుదేవుడనీ (వీచే గాలి యనీ), శివుని అవతారమనీ, శ్రీరాముని పిచ్చిభక్తుడనీ, ఎంత ఉగ్రుడైనా రామనామం కీర్తించగానే మెత్తబడిపోతాడనీ ఏవేవో పిచ్చికథలు వ్రాసిపెట్టారు. ఇంకా వ్రాస్తూనే ఉన్నారు. సినిమాలు తీస్తూనే ఉన్నారు. ఇది మంచిది కాదు. ఇట్టి పిచ్చిపిచ్చి కథలవల్లనే మన ఆదర్శపురుషులు విమతస్థుల హేలనకు గురి అవుతున్నారు. చరిత్రలు నానమ్మ కథలౌతున్నాయి. తస్మాత్ జాగ్రత.

# శ్రావణ పూర్ణిమ - నూతన యజ్ఞోపవీతం

శ్రావణ మాసంలో వేదశ్రవణం చెయ్యాలని పెద్దలంటారు. శ్రావణ పూర్ణిమ రోజున ఆర్య స్త్రీ పురుషులంతా నూతన యజ్ఞోపవీతాన్ని ధరించి వేద స్వాధ్యాయం ప్రారంభిస్తారు. సృష్టికర్తయైన పరమేశ్వరు డిచ్చిన జ్ఞానమే వేదం. సృష్ట్యాదిలో ఆదిమానవులలోని యోగ్యులైన ఋషులకు ఆ జ్ఞానం లభించింది. అది అప్పటి నుండి ఇప్పటి వరకు గురుశిష్యపరంపరగా వస్తూ నేటికినీ నిలిచియున్నది. అందులో మానవుల కవసరమైన సమస్త భౌతికవిద్యలు, ఆధ్యాత్మిక విద్యలు బీజరూపంలో ఉన్నాయి.

ప్రాచీనకాలంలో బాలబాలికలకు 8వ సంవత్సరంలో ఉపనయనం చేసి గురుకులాలకు పంపేవారు. అక్కడ వేదాధ్యయనానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చేవారు. ముందుగా వేదార్థాన్ని సరిగా తెలుసుకోవటానికి అవసరమైన వ్యాకరణ జ్ఞానాన్ని నేర్పేవారు. అనంతరం విద్యార్థుల అభిరుచిని బట్టి వారి వారికి కావలసిన విద్యలను

బోధించేవారు. విద్యపూర్తయ్యేవరకు (యుక్తవయస్సు వచ్చేవరకు) పిల్లలు గురుకులాలలోనే ఉండిపోయేవారు. ఊరికి దూరంగా బాలురకు వేరుగా, బాలికలకు వేరుగా గురుకులాలుండేవి. అట్టి గురుకులాలలో చేర్పించేముందు తల్లిదండ్రులు పిల్లలకు ఉపనయన సంస్కారం జరిపించేవారు.

ఉపనయన సంస్కారంలో యజ్ఞోపవీతాన్ని ధరింప జేయటమే ప్రధానమైన అంశంగా ఉంటుంది. బాలికలకు కూడా ఈ సంస్కారం చేయించేవారు. చేయించాలికూడా. యజ్ఞోపవీతంలో మూడేసి దారాలతో పేనిన మూడు ప్రోగులుంటాయి. దీనిని ఒక ముడి అంటారు. ఈ మూడు ప్రోగులు మన ఎడమ భుజంపై వ్రేలాడుతూ మనకు 3 ఋణాలున్నాయని గుర్తుచేస్తూ ఉంటాయి. అవే - పితృఋణం, దేవఋణం, ఋషిఋణం. ఈ మూడు ఋణాలు ప్రతీ మనిషికి జన్మతోనే వస్తాయి. ఈ ఋణాలను తీర్చుకోకుంటే మనం ఋణగ్రస్తులమై పాపభాగులమౌతాము. వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

1) <u>పితృఋణం</u> :- మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు మనం ఋణపడి ఉంటాము. వారు మనకు మానవ శరీరాన్ని ఇవ్వటమేకాక బాల్యంలో మన కెన్నెన్నో సేవలు చేశారు. కనుక మనం పెద్దవారమైన తరువాత వారి కవసరమైన సేవలు చెయ్యాలి. ముఖ్యంగా వృద్ధాప్యంలో వారిని మన కన్నబిడ్డలవలె ఆలనా పాలనాచేసి ఆ ఋణం తీర్చుకోవాలి. అంతేకాని, చనిపోయిన తరువాత పిండప్రదానాదులు పెట్టటం కాదు.

2) <u>దేవఋణం</u> :- కొన్ని దివ్యగుణాలను కలిగి ఉంటాయి కనుక సృష్టిలోని పంచభూతాలను, ప్రాకృతిక శక్తులను దేవతలంటారు. అంటే - ఇవి జడదేవతలు - జ్ఞానంలేని దేవతలు. వాటితోనే మన శరీరాలు నిర్మితమయ్యాయి. వాటిలోనే, వాటి సహకారంతోనే మన జీవనం సాగుతోంది. ఇంతేగాక, వాటిని మనం మల మూత్ర స్వేద నిశ్వాసాల ద్వారా కలుషితం చేస్తూ ఉంటాము. కనుక అగ్నిహోత్రం ద్వారా వాటిని సేవిస్తూ ఉండాలి. సంస్కరిస్తూ ఉండాలి. అందుకనే మన ఆదర్శ పురుషుడు శ్రీ కృష్ణుడు-

శ్లో॥ **"దేవాన్ భావయతానేన, తే దేవా భావయంతు వః ।**
**పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ ॥"**

(భగవద్గీత. 3-11)

"ఓ మానవులారా! ఈ అగ్నిహోత్రం ద్వారా పంచభూతాలను భావన చేస్తూ ఉండండి. భావన చేయబడిన ఆ దేవతలు మిమ్ము భావన చేస్తాయి. ఈ విధంగా పరస్పరం భావన చేసుకుంటూ ఉత్తమ శ్రేయస్సును పొందండి" అన్నాడు. ('భావన' అనే పదానికి 'శుద్ధి చేయటం' అనే అర్థం కూడా ఉంది. ఆయుర్వేదంలో శుద్ధి చేసిన గంధకాన్ని "భావన గంధకం" అంటారు). కనుక మనం నిత్యం అగ్నిహోత్రం చేస్తూ దేవఋణం తీర్చుకోవాలి.

3) <u>ఋషిఋణం</u> :- సృష్ట్యాదిలో పరమేశ్వరుడు ఋషులద్వారా మానవులకు జ్ఞానమిచ్చాడు కనుకనూ, ఆ జ్ఞానం గురుశిష్య పరంపరగా నేటికినీ మనకు లభిస్తున్నది కనుకనూ వారికి (ఋషులకు - జ్ఞానదాతలకు) మనం ఋణపడి ఉంటాము. ఆ ఋణం తీరాలంటే మనం కూడా వేద శాస్త్రాలను చదువుతూ మన జ్ఞానాన్ని పెంచుకోవాలి. ఆ జ్ఞానానికి మన అనుభవాన్ని జోడించి ముందు తరాలకు అందజేయాలి. అప్పుడే ఋషిఋణం తీరుతుంది. **"స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్"** (తైత్తరీయ శిక్షావల్లి -11) - "స్వాధ్యాయం చేయుటలోను, ఆ జ్ఞానాన్ని ప్రచారం చేయుటలోను అశ్రద్ధ చేయవద్దు " అంటాయి మన శాస్త్రాలు.

<u>ఇది స్వాధ్యాయ పర్వము :-</u>

ముఖ్యంగా శ్రావణి పూర్ణిమ ఆ ఋషిఋణం తీర్చుకోవటానికే ఏర్పడింది. ఆ రోజున మనమంతా కాలకృత్య స్నానాదులు చేసి మంత్రపూర్వకంగా నూతన యజ్ఞోపవీతాన్ని ధరించాలి. అనంతరం సంధ్యావందనం, విశేషహోమం చేసి వేద స్వాధ్యాయాన్ని ప్రారంభించాలి. వేదమంతా ఒకే రోజున చదువలేము కనుక నాలుగు వేదాలలోని మొదటి, చివరి మంత్రాలను పఠించి ప్రారంభించినట్లుగా భావించాలి. అప్పటి నుండి ప్రతిరోజూ సంధ్యాగ్నిహోత్రాలతోబాటు కొద్దిసేపు అభిరుచిగల కొన్ని వేదమంత్రాలను వ్యాఖ్యాన సహితంగా స్వాధ్యాయం చెయ్యాలి - చదివి మననం చెయ్యాలి. ఇంకా అర్థం కాకుంటే విద్వాంసుల నడిగి తెలుసుకుంటూ ఉండాలి. వేదాలే కానక్కరలేదు ప్రామాణికమైన శాస్త్రాలను కూడా చదువుకోవచ్చును. పరమేశ్వర ప్రోక్తాలు కనుక వేదాలకు ప్రాముఖ్యతనిస్తూ ఉండాలి. ఇలా చేయటాన్నే ఋషి తర్పణమంటారు. **"స్వాధ్యాయేన్ అర్చయేత్ ఋషీన్** (మనుస్మృతి (3-81)- స్వాధ్యాయంతో ఋషులను అర్చించి - తృప్తిపరచి ఋషిఋణం తీర్చుకో" మని

మనుమహర్షి అంటారు.

స్వాధ్యాయంపై ప్రారంభంలో ఉన్న ఉత్సాహం క్రమంగా తగ్గుతూ ఉంటుంది. కనుక, మరలవచ్చే శ్రావణి పూర్ణిమ రోజున నూతన యజ్ఞోపవీతం ధరించి పున: ప్రారంభిస్తూ ఉంటారు. అంటే – ఇది స్వాధ్యాయాన్ని ప్రోత్సహించే పర్వం. ఏ రంగంలో ఉన్నవారైనా, ఏ వృత్తిలో ఉన్నవారైనా అందుకు అవసరమైన గ్రంథాలను చదువుతూ వారి జ్ఞానాన్ని పెంచుకుంటారు. అట్లే, మనం ఆధ్యాత్మికపరమైన – జీవాత్మ, పరమాత్మలను గూర్చిన జ్ఞానం పెంచుకోవాలి. అదే మానవులకు అభ్యుదయ నిఃశ్రేయసాలను ప్రసాదిస్తుంది. భౌతిక విద్యలు కేవలం ధనార్జనకు, సుఖంగా బ్రతకటానికి మాత్రమే పనికివస్తాయి, మనిషిని సంస్కరించి మహాత్ముని చేయలేవు. మనిషి మహాత్మునిగా ఎదిగి సర్వదు:ఖనివృత్తిరూప ముక్తిని పొందటానికి సహకరిస్తాయి మన వేదాలు.

<u>రాఖీపూర్ణిమ రక్షాబంధన పండుగ</u> :–

ఉత్తర భారతదేశంలోనూ, దక్షిణాన తెలంగాణా ప్రాంతంలోను శ్రావణ పూర్ణిమను **"రాఖీ పూర్ణిమ"**గా జరుపుకుంటారు. ఇప్పుడిప్పుడు ఈ పండుగ ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలకు విస్తరిస్తున్నది. 'రాఖీ' అంటే రక్షణ. స్త్రీలు తమ రక్షణ కోరుతూ ఆత్మీయులకు – అన్నాతమ్ముళ్ళకు, పెద్దలకు, రక్షించేవారికి అందమైన రాఖీలు కడతారు. తమను మంచిగా చూసుకోమనీ, దుష్టులబారి నుండి రక్షించమనీ తమ భావాన్ని వ్యక్తం చేస్తారు. ఇది నేడు చాలా అవసరం. కొన్ని సినీమాల ప్రభావంతోను, టి.వి.ల, ఇంటర్‌నెట్‌ల ప్రభావంతోను స్త్రీలను లైంగికహింసలకు గురిచేసే మృగాలు – మృగతుల్య మగాళ్ళు పెరిగిపోతున్నారు. బాలికలను కూడా రక్షించవలసిన పరిస్థితులు పెరిగిపోతున్నాయి. నేడు స్త్రీలరక్షణ చాలా అవసరము.

స్త్రీలు పురుషులకు రక్షాకంకణం కట్టటం వలన పురుషులకు వారిపై ఆత్మీయభావన (సోదరిభావన) కలుగుతుంది. చరిత్రలో ఒక సంఘటన ఉంది – చిత్తౌడ్ దుర్గానికి రాణిగా ఉండిన 'కర్ణావతి' అను ఆమె తన రక్షణ కోరుతూ మొగల్ చక్రవర్తి హుమాయూన్‌కు రక్షాకంకణం (రాఖీ) పంపింది. దానితో ఆయనకు సోదరీభావం కలిగి చిత్తౌడ్‌పై దండెత్తనున్న బహదూర్‌షాను అణచివైచి ఆమెకు సాయపడ్డాడు. కనుక రాఖీ పండుగ జరుపుకోవడం కూడా అవసరమే.

**శ్రద్ధాంజలి** :- పూర్వం మన ప్రాంతం హైదరాబాద్ సంస్థానంలో ఉండేది. అప్పటి నవాబు రజాకార్లను ప్రోత్సహించి హిందువులను చాలా హింసించాడు. ఆ సమయంలో ఆర్యసమాజం హిందువులకు రక్షణకవచంగా నిలిచింది. హైదరాబాద్ సంస్థాన విముక్తికై ఉద్యమం సాగించింది. అప్పుడు ఉత్తరభారతం నుండి వేలకొలది ఆర్యసమాజికులు వచ్చి సాయంచేశారు. ఆ పోరాటంలో 28 మంది ఆర్యులు అసువులు బాసారు. వేలమంది క్షతగాత్రులయ్యారు. కొందరు వికలాంగులు కూడా అయ్యారు. అందుచే ఈ ప్రాంతపు ఆర్యులు శ్రావణీ ఉపాకర్మ చివరిభాగంగా ఆ బలిదాన వీరులకు శ్రద్ధాంజలు లర్పిస్తారు.

మూడు ఋణాలనుగురించి తదుపరి ప్రకరణంలో మరికొంత వివరంగా తెలుసుకుందాము.

## యజ్ఞోపవీతం ఎందుకు?
# మనం మూడు ఋణాలతో పుట్టాము !!

**జాయమానో హి వై పురుషః త్రీణ్ ఋణవాన్ అభిజాయతే ।**
**ఋణాని త్రీణి అపాకృత్య మనో మోక్షే నివేశయేత్ ॥**

- ఉపనిషత్ సంగ్రహం

పురుషుడు (మనుష్యుడు) మూడు ఋణాలతో పుడతాడు. ఆ మూడు ఋణాలను తీర్చుకున్నవాడే విశుద్ధమైన మనస్సును పొంది మోక్షమును పొందుటకు అర్హుడౌతాడు. అవే - పితృ, దేవ, ఋషి ఋణాలు.

పై ఋషివాక్కులు మనకు వింతగా అనిపించ వచ్చును- కానీ యివి పూర్తిగా సత్యం. సామాన్యంగా ఋణం అంటే అప్పు. ఏదైనా క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు ఉన్నవారినుండి కొంత అప్పుగా తీసుకుంటాము. క్రమంగా దానిని తీర్చివేస్తూ ఉంటాము. ఆ అప్పు ధనరూపంలోనే ఉండాలనిలేదు అది వస్తువు కావచ్చు, సేవలు కావచ్చు, మాటసాయం కావచ్చు, శరణాగతి కావచ్చు, మరేదైనా కావచ్చు. సామాజిక జీవనంలో ఇవన్నీ సామాన్యమే. అయితే జన్మతోనే అప్పులు ఎందుకు వస్తాయన్నది జిజ్ఞాసువుల ప్రశ్న.

### పితృఋణం

ఋషులు చెప్పే పై మూడు ఋణాలలో మొదటిది పితృఋణం. మనకు

జన్మనిచ్చిన తల్లిదండ్రులకు మనం ఋణపడి ఉంటాము. ఎట్లంటే - తల్లి మనను నవమాసాలు గర్భంలో మొయ్యటమే కాకుండా తన శరీరంలోని రక్తాన్ని పంచియిచ్చింది. తద్వారా ప్రోటీన్లను, క్రొవ్వులను, కార్బోహైడ్రేట్లను, జీవరసాయనాలను (Bio - Chemics ను), విటమిన్లను ఇచ్చి మన శరీరానికి ఉపాదాన కారణమయ్యింది - నిర్మాత్రి అయ్యింది. గర్భసమయంలో ఎన్నో యిబ్బందులకు గురిఅయ్యింది. ఎన్నో జాగ్రత్తలు తీసుకుంది, పథ్యాలు చేసింది. మందులు వేసుకుంది. చాలా కష్టాన్ని సహించి కాన్పుజరిపి మనను భూమిపైకి తీసుకు వచ్చింది. మల మూత్రాదులను అసహ్యించుకోకుండా ఎన్నో రకాల సేవలు చేసింది. మనకు అన్నాదులు జీర్ణమయ్యే వరకు తన రక్తాన్ని పాలుగామార్చి పోషించింది. నడక మాటలు స్నాన శౌచ వస్త్ర ధారణాదులు నేర్పింది. ఇలా వ్రాసుకుంటూ పోతే పెద్ద పుస్తకమే అవుతుంది.

ప్రత్యక్షంగా కాకున్నా పరోక్షంగా తండ్రిచేసిన సేవలు కూడా చాలానే ఉంటాయి. ఆయన సంపాదించి ఆలనా పాలనా చూసుకోబట్టే అమ్మ నిశ్చింతగా మనకు సేవలు చెయ్యగలిగింది. తండ్రి మనను పోషించి చదివించి విద్యా బుద్ధులు, సభ్యతా సంస్కారాలు, సమాజంలో మెలగ వలసిన తీరుతెన్నులు నేర్పారు. తన ఆస్తిపాస్తులకు వారసులను చేశారు. కనుక మాతాపితరుల ఋణం (పితృఋణం) మనకు పుట్టుకతోనే వస్తుంది. మన జ్ఞాన వికాసానికి వారే మొదటి కారణాలు. అందుచేతనే "మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద" అంటుంది శతపథ బ్రాహ్మణం (14-06-10). "మాతృదేవో భవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అంటుంది తైత్తరీయోపనిషత్ (శిక్షావల్లి - 11).

ఈ మొదటిదైన పితృఋణం తీరాలంటే వారు జీవించి ఉన్నపుడే వారికి సేవలు చేసి, వారితో ప్రియంగా వ్యవహరించి తీర్చుకోవాలి. వారు వృద్ధాప్యంవల్లగానీ, వ్యాధివల్లగాని, మరేకారణంతోనైనా గానీ అశక్తులైనపుడు వారికి అవసరమైన అన్నిరకాల సేవలు చెయ్యాలి. వారి మనస్సు నొప్పింపక ప్రేమతో వ్యవహరించాలి. వారికి మనం అనువ్రతులం కావాలి. అంటే - వారు చేసిన దాన ధర్మాది సత్కార్యాలను, పరోపకార అభయ దానాది వంశ మర్యాదలను మనం అనుసరించి చేస్తూ ఉండాలి. "అనువ్రతః పితుః పుత్రః మాత్రా భవతు సంమనాః" అంటుంది అథర్వవేదం

(3-30-2).

మహాభారతయుద్ధం తరువాత మనదేశంలో కొన్ని అవైదిక పురాణాల కల్పన జరిగింది. కొందరు స్వార్థపరులు స్వప్రయోజనంకొరకు కొన్ని సాంప్రదాయాలను, ఆచారాలను పురాణాలుగా వ్రాసిపెట్టారు. అందులోనిదే మృతక శ్రాద్ధ తర్పణాది ఆచారం. వివరంగా తెలుసుకో గోరువారు మహర్షి దయానంద సరస్వతుల వారి జగత్ప్రసిద్ధ రచన "సత్యార్థప్రకాశం" లోని ఏకాదశ సముల్లాసం చదువగోరుచున్నాము. ఇక మనం రెండవ ఋణం గురించి తెలుసుకుందాము. రెండవది -

## దేవఋణం

దేవతలు అంటే "దివ్యమైన పరోపకారాది దివ్యగుణాలు కలిగినవా" రని అర్థం. ఆ దివ్యగుణాలు వ్యక్తులలో ఉంటే వారిని చేతన దేవతలనీ, పదార్థాలలో ఉంటే వాటిని జడ దేవతలనీ అంటారు. చేతనము అంటే జ్ఞానం కలది యనీ, జడము అంటే జ్ఞానంలేనిది అనీ అర్థం. ఈ రెండవ ఋణం జడదేవతల ఋణం. జడదేవతలలో ముందుగా లెక్కించ తగినవి పంచభూతాలు- భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములు.

ఈ పంచభూతాల ఋణం మనకు జన్మతోనే వస్తుంది. ఎందుచేతనంటే - వాటితోనే మన శరీరాలు నిర్మించ బడ్డాయి, పెరిగి పెద్దవైనాయి. వాటిలోనే, వాటి ఆధారంతోనే జీవిస్తున్నాయి. వీటిలో జ్ఞానం లేకపోయినా ఇవి సదా ప్రాణులకు మేలు చేస్తూనే ఉంటాయి. కనుక వీటిని జడ దేవతలన్నారు.

మన శరీరాల ద్వారా వెలువడే మల మూత్ర స్వేద నిశ్వాసాల ద్వారా ఈ పంచభూతాలు మలినమౌతూ ఉంటాయి. వాటిని శుద్ధచేసే ఏర్పాట్లు సృష్టిలో ఉన్నా బుద్ధిజీవులమైన మనంకూడా కొంత ప్రయత్నం చెయ్యాలి అంటుంది వేదం. ప్రతీ వ్యక్తి ఉదయ సాయం సమయాలలో పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనల తోబాటు దైనిక అగ్నిహోత్రకార్యం చెయ్యాలంటుంది యజుర్వేదం. ఇది పర్యావరణాన్ని పరిశుద్ధంచేసే ఒక వైజ్ఞానిక ప్రక్రియ. మామిడి మోదుగ రావి మొదలైన సమిధలతో అగ్నిని జ్వలింపచేసి దానిలో దేశీ ఆవునేతిని ఆహుతులుగా యివ్వాలి. దానితోబాటు ఆ యా ఋతువులకు అనుకూలమైన మూలికలను, సుగంధ ద్రవ్యాలను ఆహుతులుగా యిస్తే చక్కటి ఫలితాలు కలుగుతాయి. గృహంలోని, పరిసరాలలోని వాయువు

శుద్ధమౌతుంది. తద్వారా ఇంట్లోనివారికి చక్కటి ఆరోగ్యం, బలం, ఉత్సాహం,స్ఫూర్తి కలుగుతాయి. ఈ విధంగా దైనిక అగ్నిహోత్రం చేస్తూ దేవతలఋణం తీర్చుకోవాలి.

### ఋషిఋణం

ఋషిఋణం అంటే జ్ఞానఋణం. సృష్టి కర్తయైన సర్వవ్యాపక సర్వేశ్వరుడు ఆదిమానవసృష్టి సమయంలోనే యోగ్యులైన నలుగురు ఋషుల హృదయాలలో ఋగ్ యజుర్ సామ అథర్వ వేదాలను ప్రకాశపరచాడు. వారు వాటిని తోటి సామాన్యమానవులకు నేర్పారు. ఆ మంత్రాలను అర్థంచేసుకోవటానికి కావలసిన వేదాంగాలను - శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిష్యాలను రూపొందించి శిష్యుల కుపదేశించారు. ఆనాటినుండి ఈ నాటివరకు గురుశిష్య పరంపరగా వేదాలు, వేదాంగాలు వస్తున్నాయి. తదుపరి వచ్చిన ఋషులు వాటి ఆధారంతో పరిశోధనలు జరిపి ఉపవేదాలు, ఉపనిషత్తులు, దర్శనాలు మొదలైన అనేకానేక శాస్త్రాలు వ్రాశారు. వాటిని లోకంలో విస్తృతంగా ప్రచారం చేశారు. అందువల్ల అవి మనవరకు నిలిచి ఉన్నాయి. కనుక మనంకూడా మన శక్తికొలది కొన్ని శాస్త్రాలను అధ్యయనం చేసి, వాటికి మన అనుభవాన్ని జోడించి ముందుతరాలకు అందించే ప్రయత్నం చెయ్యాలి. అలా చేస్తేనే ఋషిఋణం తీరుతుందంటాయి శాస్త్రాలు.

**స్వాధ్యాయేనార్చయేత్ ఋషీన్, హోమైర్ దేవాన్ యథావిధిః ।**
**పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా॥**

- మనుస్మృతి (3-57)

అంటే - "ఋషులు వ్రాసిన గ్రంథాలను అధ్యయన అధ్యాపనలు చేస్తూ ఋషుల ఋణాన్నీ, యాథావిధిగా హోమాలు చేస్తూ దేవ ఋణాన్నీ, జీవిత మాతా పితరులకు శ్రద్ధతో సేవలు చేస్తూ పితృఋణాన్నీ ఆశ్రిత ప్రాణులకు ఆహారం పెడుతూ బలివైశ్యదేవ యజ్ఞం చేయలంటాయి తీర్చుకోవా" లంటాయి శాస్త్రాలు.

ఈ మూడు ఋణాలు మనకు జన్మతోనే వస్తాయని తెలపటానికే మూడు ప్రోగులుగల యజ్ఞోపవీతాన్ని ధరింపచేస్తారు మన పెద్దలు. అది సదా మన ఎడమ భుజంపైన ఉంటూ మనకు ఋణాలను గుర్తుచేస్తూ ఉంటుంది. విద్యా సదాచారాలు గల స్త్రీపురుషులంతా ద్విజులేనంటాయి వేదశాస్త్రాలు. కనుక అట్టివారంతా

యజ్ఞోపవీతం ధరించవచ్చు. యజ్ఞమయ జీవితం గడుపవచ్చు. మీరు ఏ వయస్సులో ఉన్నవారైనా మీకు యజ్ఞోపవీత సంస్కారం చెయ్యటానికి ఆర్యసమాజం సదా సిద్ధంగా ఉంటుంది. స్వస్తి – మీకు మంచి అగునుగాక!

నరక చతుర్దశి నిజమా?

# శ్రీ కృష్ణుడు ఏకపత్నీవ్రతుడు ! ?

భారతీయ ఇతిహాసంలో శ్రీరామ శ్రీకృష్ణ లిరువురు అద్వితీయ మహాపురుషులుగా, ఆదర్శపురుషులుగా యుగపురుషులుగా కీర్తింపబడ్డారు. త్రేతాయుగంనాటి శ్రీరాముని మూర్తీభవించిన ధర్మమూర్తిగా ఆబాలగోపాలం, పండితులనుండి పామరుల వరకు ఆరాధిస్తారు. అతడు ఏకపత్నీవ్రతుడనీ, సీతారాముల దాంపత్యం తరతరాలకు ఆదర్శంగా సృష్టిఉన్నంత కాలం ప్రజల మనస్సులలో నిలిచిపోతుందనీ కొనియాడతారు. కానీ, శ్రీకృష్ణుని విషయం వచ్చేసరికి అది మరొకరకంగా మారిపోయింది. ఒకప్రక్క అతడు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసిన మహాపురుషుడనీ, ఆదర్శ యుగపురుషుడనీ, దేవుని అవతారమేననీ కీర్తిస్తూ మరొక ప్రక్క అతడు బహుపత్నీకుడంటారు. అతనికి 8 మంది భార్యలున్నారనీ, నరకాసురుడు చెరబట్టిన 16,000 మంది కన్యలను విడిపించి వారందరినీ తానే పెండ్లాడాడనీ అంటారు. ఇంతేగాక కృష్ణుడు తన మేనత్త రాధతోనూ, అనేకమంది గోపికలతోనూ, చివరకు కుబ్జ దాసితో కూడా జారత్వం జరిపా డంటారు. వివేకవంతులు ఇదేమి ఆదర్శమని నిలదీస్తే కాస్త సర్దుకుని – 'లేదు లేదు ఆ కథలన్నీ కొన్ని ఆధ్యాత్మిక విషయాలు సామాన్య ప్రజలకు అర్థం కావటానికి వ్రాసిన ఆలంకారిక కథలంటారు. ఇందులో ఏది సత్యం? భక్తునికీ భగవంతునికీ పతీపత్ని సంబంధం, జారత్వ సంబంధం ఏ వేదంలో ఉంది? వేదాలలో లేని సంబంధాలు ప్రామాణిక మెట్లవుతాయి?

కొంతమంది చరిత్రకారులు శ్రీకృష్ణచరిత్రపై చాలా పరిశోధనలు చేశారు. విస్తృత అధ్యయనాలు చేశారు. ఎన్నో పుస్తకాలు వ్రాశారు. వీరిలో కొందరు విదేశీయులు కూడా ఉన్నారు. వీటన్నిటిని సమీక్షించి మహాభారతంలో వివరించిన

శ్రీ కృష్ణచరిత్రయే సత్యమైనదన్నారు. పురాణాలలోనివన్నీ కట్టుకథలన్నారు. **'నానీకీ కహానియా'** (నానమ్మకథ) లన్నారు.

మనం వ్యాసమహాభారతాన్ని పరిశీలించి చూస్తే శ్రీకృష్ణునికి రుక్మిణీ, సత్యభామా, జాంబవతి ముగ్గురు భార్యలున్నట్లు కనబడతారు. కానీ, ఇదికూడా సత్యం కాదంటారు మన జాతీయగీతం "వందేమాతరం.........." వ్రాసిన శ్రీ బంకిమ్‌చంద్ర చటోపాధ్యాయగారు. వారు గొప్ప దేశభక్తులేకాక ఆధ్యాత్మిక చింతకులు, పరిశోధకులు, కవులు, రచయితలు. శ్రీ కృష్ణుని విషయంలో ఇంత వైవిధ్య కల్పనలు ఎలా వచ్చినవని పరిశోధనలు జరిపారు. మహాభారతాన్నీ భాగవత బ్రహ్మవైవర్త విష్ణుపురాణాదులను, దేశ విదేశీయులు వ్రాసిన శ్రీకృష్ణ చరిత్ర గ్రంథాలను జాగ్రత్తగా అధ్యయనం చేసి విశ్లేషిస్తూ "శ్రీ కృష్ణ చరిత్ర" పేరుతో ఒక చక్కటి గ్రంథం వ్రాశారు. దానిలో ఆయన శ్రీకృష్ణుని బహువివాహాల విషయంలో తన నిర్ణయాన్ని గురించి ఈ విధంగా వ్రాశారు -

"మహాభారతంలోని మూల అంశాలనుబట్టి చూస్తే రుక్మిణీతప్ప కృష్ణునకు మరొక భార్య లేనట్లు ప్రమాణాలు కనబడుతున్నాయి. రుక్మిణీ సంతానమే తరువాత రాజసింహాసనాన్ని అధిష్ఠించెను. వేరొక భార్యకు పుట్టిన వారెవరు కనబడరు. కనుక, శ్యమంతకమణితో ఆయనకు సత్యభామాది స్త్రీలు లభించినారనుట, నరకాసురుని 16వేల రాణులను కూడా పెండ్లాడాడనుట నానమ్మ కథలే (కల్పిత కథలే), ఈ కథలు చదివి మనోరంజనం పొందవలసిందేగాని నమ్మదగినవి కావు" అని వ్రాశారు.

పురాణకర్తలు శ్రీ కృష్ణుని ఏకపత్నీవ్రతంతో సంతోషించక ఆయనకు ఎనిమిదిమంది పట్టపురాణులున్నారని కథలనల్లారు. భాగవతంలో రుక్మిణిగాక సత్యభామ, జాంబవతి, కాలింది, సత్యా, లక్ష్మణా, మిత్రవృన్దా, భద్రా అనే పేర్లతో మరొక ఏడుగురు భార్యలున్నట్లు వ్రాయబడింది. వీరితో శ్రీ కృష్ణునకు వివాహాలు జరిగిన కథలను కల్పించి వ్రాశారు. కృష్ణుడు ప్రాగ్జోతిషపురం రాజైన నరకాసురుని చంపి 16 వేలమంది అతని స్త్రీలను వివాహమాడినట్లు భాగవతంలోని 59 వ అధ్యాయంలో ఉంది. ముందుగా నరకాసురుని సేనాపతి 'ముర' అనే వానిని చంపినందున కృష్ణునకు 'మురారి' అనే పేరు వచ్చిందట.

ఈ ఘట్టాన్ని బంకించంద్రుల వారు విశ్లేషిస్తూ శ్రీకృష్ణుని కాలంలో

ప్రాగ్జ్యోతిషపురానికి రాజు నరకాసురుడు కాదు, 'భగదత్తుడు' అన్నారు. ఆ భగదత్తుడే మహాభారతయుద్ధంలో దుర్యోధనుని పక్షంలో యుద్ధంచేసి అర్జునుని చేతిలో మరణించాడన్నారు. కావాలంటే మహాభారతాన్ని చదివి చూసుకోండన్నారు. జాంబవతీ సత్యభామల విషయం ప్రస్తావిస్తూ అయినా,ఎలుగుబంటికి మానవకన్య ఎలాపుడుతుంది? జాంబవతే కల్పితమైతే సత్యభామకూడా కల్పితమేకదా! అన్నారు. పంజాబ్‌కేసరి శ్రీ లాలా లాజ్‌పత్‌రాయ్ గారు కూడా ఒక శ్రీకృష్ణ చరిత్ర వ్రాశారు. అందులో వారు తమ అంతిమ నిర్ణయాన్ని ఈ విధంగా వ్రాశారు -

"ప్రపంచంలో మహాపురుషులపై అనేకమంది విరోధులు అసత్య ఆరోపణలు చేశారు. కానీ, మహాపురుషుడైన శ్రీకృష్ణునిపై ఆయన భక్తులే అనేక దోషారోపణలు చేశారు. శ్రీకృష్ణుడు భక్తుల అనేక ఆరోపణలకు ఎరగా అయిపోయాడు. ఇప్పటికీ అనేక ఆరోపణలు చేస్తూనేవున్నారు. సాధారణంగా శ్రీకృష్ణుడే క్రొత్త క్రొత్త అవతారాలను ధరిస్తాడంటారు. శ్రీ రాముడు అవతారాలను ధరిస్తాడని ఎప్పుడైనా విన్నామా? వీరిరువురూ విష్ణువు అవతారాలేనంటారు.ఏమిటీ ఈ విచిత్రం?" అన్నారు. ఇంకా-

"శ్రీకృష్ణునివంటి వ్యక్తి ఈ దేశమందేకాక ప్రపంచంలో మరెక్కడా ఇంతవరకు జన్మించలేదు. ఆర్యమర్యాద రక్షకుడైన శ్రీరామునితో శ్రీకృష్ణుని వ్యక్తిత్వాన్ని పోల్చవచ్చును కాని వీరిరువురు జీవించిన యుగాలు, ఆకాలంనాటి జీవనపరిస్థితులు వేరు వేరు. శ్రీరాముడు స్వయంగా ఒక ఆదర్శమూర్తియైన రాజు. కానీ శ్రీకృష్ణునకు ఒక ఆదర్శరాజ్యాన్ని స్వయంగా స్థాపించవలసి వచ్చింది. శ్రీకృష్ణుడు ఎందరో దుష్టులను సంహరించి, సంహరింపచేసి అక్కడ ధర్మాత్ములైన వారిని రాజులుగా చేశాడేకాని తాను రాజుకాలేదు. ఆయన ఆర్య సామ్రాజ్య సంస్థాపకుడు. శ్రీకృష్ణ డెదుర్కొన్న సమస్యలు శ్రీరామునకు లేకుండెను. అందువల్ల ఏ విధంగా చూచినా శ్రీకృష్ణుని చరిత్ర, వ్యక్తిత్వం భూమండలంలో అద్వితీయమే. (అటువంటివ్యక్తి మరొకరు పుట్టలేదనే చెప్పవచ్చు)" అని వ్రాశారు.

శ్రీ లాజ్‌పతి రాయ్‌గారి పై వాక్యాలు ఇప్పటికైనా మనకు కనువిప్పు కలిగించాలి. "ఇంట్లో రామయ్య - వీధిలో కృష్ణయ్య" వంటి సినీమాలు, కథలు, పాటలు వ్రాయకూడదు. పాడకూడదు. భగవద్గీతవంటి జగత్ప్రసిద్ధ ఆధ్యాత్మిక విద్యను చెప్పిన యోగేశ్వర శ్రీ కృష్ణునిపై నిందలు మోపకూడదు. ప్రపంచ తత్త్వవేత్తలు,

మేధావులు భగవద్గీత ముందు తలలు వంచారు. అటువంటి మహాపురుషునిపై దోషారోపణలా? మహర్షి దయానందులవారు తమ జగత్ప్రసిద్ధ సత్యార్థప్రకాశంలో శ్రీ కృష్ణుని గురించి ఎంతో ఆవేదనతో వ్రాసిన ఈ క్రింది వాక్యాలు చదవండి -

"శ్రీకృష్ణుని ఇతిహాసం మహాభారతంలో అత్యుత్తమంగా ఉంది. అతని గుణకర్మ స్వభావాలు, చరిత్ర ఆప్తపురుషుని వంటివి. శ్రీ కృష్ణుడు పుట్టింది మొదలు మరణించేదాకా ఏ అధర్మకార్యం చేసినట్లు అందులో కనబడదు. ఈ భాగవతకారుడు అనుచితంగా ఇష్టం వచ్చినట్లు దోషాల నారోపించాడు. పాలు, పెరుగు, వెన్న, మీగడలను దొంగిలించాడనీ, కుబ్జ దాసితో వ్యభిచరించాడనీ, పరస్త్రీలతో రాసమండలంలో క్రీడించినాడనీ, ఇట్టివే మరెన్నో లేనిపోని నిందలు శ్రీకృష్ణునిపై ఆరోపించాడు. అట్టివాటిని చదువుచు చదివించుచు, వింటూ వినిపించుచు అన్య మతాలవారు శ్రీకృష్ణుని అనేక విధాల నిందిస్తున్నారు. (గేలి చేస్తున్నారు). ఈ భాగవతం వ్రాయబడకుండావుంటే బాగుండేది. మహాత్ముడైన శ్రీకృష్ణుడు వ్యర్థంగా మిథ్యానిందలపాలు కావలసి రాకుండేది."

- సత్యార్థ ప్రకాశం (11వ.సముల్లాసం)

వ్యాసమహర్షి మహాభారత సభాపర్వంలో ధర్మజుని రాజసూయ యజ్ఞాన్ని చక్కగా వర్ణించాడు. యజ్ఞపరిపూర్తి సమయంలో భీష్ముడు ధర్మరాజును దగ్గరకు పిలిచి, నాయనా! ఈ విశాల సభలో అగ్రపూజకు శ్రీ కృష్ణుడే అర్హుడంటూ కృష్ణునిలోని పెక్కు గుణాలను కీర్తిస్తాడు.

**శ్లో॥ వేదవేదాంగ విజ్ఞానం బలం చాప్యధికం తథా।**
**నృణాం హి లోకే కోఽన్యోఽస్తి విశిష్టః కేశవాదృతే ॥**

- మ.భా. సభాపర్వం (38-19)

శ్రీ కృష్ణునిలో వేదవేదాంగాల విజ్ఞానం, క్షాత్రబలవీర్యాలు నిండుగా ఉన్నాయి. అట్టి కేశవుని మించినవ్యక్తి లోకంలో మరెవరూ లేరు అంటాడు.

ఇంతేగాక, కృష్ణునికి రుక్మిణితో వివాహమైన వెంటనే వధూవరులిద్దరు హిమాలయ ప్రాంతంలోని బదరికావనానికి వెళ్ళి 12 సంవత్సరాలు బ్రహ్మచర్య తపస్సు నాచరించారు. అనంతరం సమాగమం సలిపి ప్రద్యుమ్న కుమారుని కన్నారు. అట్టి స్థితప్రజ్ఞునిపైన దోషారోపణలు చెయ్యటం సబబా ! ఆలోచించండి.

విజయదశమి:

# విజయం కొరకు విజయ దశమి

మానవుడు సహజంగా విజయకాంక్షి. తానున్న రంగంలో విజయం పొందగోరతాడు. ఇంద్రియాలతో పొందే సుఖం క్షణికమే. కాని, విజయంవల్ల పొందే సుఖం - ఆనందం తీపిజ్ఞాపకంగా చిరకాలం ఉంటుంది. రాజులు రాజ్యాలను జయించాలని కాంక్షిస్తే, సామాన్యులు సామాన్య విజయాలను పొందగోరతారు. విద్యార్థులు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులు కాగోరితే, ఉద్యోగస్తులు ప్రశంసాపత్రాలను పొందగోరతారు. క్రీడాకారులు విజేతలు కాగోరితే, కళాకారులు ఆయా కళలలో అగ్రగణ్యులు కాగోరుతారు. భారతీయార్యుల ధర్మగ్రంథాలైన వేదాలు విజయం కోరేవారు పూర్ణపురుషార్థం చెయ్యాలంటాయి. ఈ విధంగా సంకల్పించమంటుంది అథర్వవేదం.

**ఓం కృతం మే దక్షిణే హస్తే, జయో మే సవ్య ఆహితః ।**
**గోజిద్ భూయాస మశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥**

- అథర్వవేదం (7-50-8)

పూర్ణపురుషార్థం కుడిచేతిలోనున్న నాకు అలవోకగా జయం నా ఎడమ చేతికి లభించుటలో సందేహమేమున్నది ? నేను విశాలమైన భూభాగమును జయింతును గాక! గో అశ్వసంపదలను, ధన రాశులను సువర్ణ రత్న రజితాదులను జయింతును గాక! పొందుదును గాక!

పురుషార్థం అంటే - విశేషమైన కృషి - పరిశ్రమ - ప్రయత్నం. అది పూర్ణంగా ఉండాలి. మన శక్తులన్నిటిని ఒడ్డి ప్రయత్నించాలి. అది ఉన్న వ్యక్తి తాననుకొన్నది సాధించగలుగుతాడు. అందుకనే **"సాధనమున పనులు సమకూరు ధరలోన"** అన్నారు పెద్దలు.

ఈ పూర్ణ పురుషార్థంతో బాటు పరమేశ్వరుని సఖ్యతయూ అవసరమే నంటుంది వేదం. **'వయం జయేమ త్వయా యుజా'** (ఋగ్వేదం 1-102-4) హే పరమేశ్వర! నీ సఖ్యతతో మేము జయింతుము గాక! మనం ఎంచుకొన్నది ధర్మమార్గమైనపుడే అంతర్యామియైన పరమేశ్వరుని నుండి మంచి ప్రేరణ ప్రోత్సాహం కలుగుతాయి. అందుకు కావలసిన శక్తి యుక్తులు, సహాయ సహకారాలు లభిస్తాయి.

కనుక, విజయాన్ని కోరుతూ జరుపుకునే ఈ విజయదశమి పండుగనాడు పరమేశ్వరుని స్తుతి ప్రార్థనలు, విశేష మంత్రాలతో బృహత్ యజ్ఞం చెయ్యటం మంచిది.

అథర్వవేదం 3వ కాండలోని 19వ సూక్తంతో ఈ విశేష హోమం ప్రారంభింపబడుతుంది. 8 మంత్రాలుగల ఈ సూక్తానికి దేవత పురోహితుడు. ఇచ్చట పురోహితుడంటే గుళ్ళల్లో పూజలు చేసే పూజారులు కారు. పురానికి లేదా దేశానికి హితంచేసే రాజులు, నాయకులు అని అర్థం. వారి సంకల్పం ఎలా ఉండాలో ఈ మంత్రాలు నిర్దేశిస్తాయి. వీటిలో మొదటి మంత్రం ఈ విధంగా ప్రేరేపిస్తుంది.

**ఓం సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం వీర్యం బలమ్ ।**
**సంశితం క్షత్రమజర మస్తు జిష్ణూ ర్యేషా మస్మి పురోహితః ।**

– అథర్వవేదం (3–19–1)

"మా దేశ బ్రాహ్మీశక్తిని – విద్యా విజ్ఞాన వేత్తలను ఎట్టి పరిస్థితులనైనా ఎదుర్కొనటానికి సిద్ధం చేశాను. మా దేశ బలవీర్యాలు ఎట్టి ఆపదలనైనా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉన్నాయి. మా దేశ క్షాత్రశక్తి (సైనిక శక్తి) ముసలితన మెరుగని నిత్యయౌవ్వనంతో జయశీలయై యున్నది. అట్టి దేశానికి నేను పురోహితుడనని – నాయకుడనని చెప్పుకొనుటకు గర్వించుచున్నాను".

మిగిలిన మంత్రాలలోనూ ఇట్టి భావాలే ఉన్నాయి. "మా శస్త్రాస్త్రాలు తీక్షణముగా వజ్రతుల్యంగా ఉన్నాయి. శత్రువు లెంతటి బలవంతులైనా అవి చీల్చి చెండాడగలవు. సదా మా వీరులు జయఘోషలు చేస్తారు. అట్టి దేశానికి నేను పురోహితుడను – రాజును – నాయకుడను" అని పురోహితులు – నాయకులు సంకల్పించాలంటాయి.

ధన కనక వస్తు వాహనాల నెన్నిటిని సమకూర్చుకున్నా వాటిని రక్షించగల క్షాత్రశక్తి – సైనికశక్తి ప్రతీదేశానికీ అవసరం. ఇంతేగాక, వారికి కావలసిన ఆయుధాలూ అవసరమే. కనుక, అవసరాన్ని బట్టి ఆధునిక ఆయుధాలు సమకూర్చుకోవాలి. ముఖ్యంగా విజయదశమిని ఆయుధపూజగా జరుపుకుంటారు. పై మంత్రంలోని 'సంశిత' పదం ఆయుధాలను పదును పెట్టుకుని సిద్ధంగా ఉంచుకోమంటుంది. ఎటువంటి ఆపదనైనా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండమంటుంది.

పూర్వకాలంలో ప్రతీ వ్యక్తి ఏదైనా ఒకటి, రెండు ఆయుధాలు ప్రయోగించటం

నేర్చుకునేవారట. కాని, దేశకాల పరిస్థితులు మారి నేడు ఆత్మరక్షణకైనను ఆయుధాలు ధరించటం నేరమౌతున్నది. చట్టాన్ని మన చేతులోకి తీసుకోకూడదట!! అయినప్పటికీ మన ప్రాచీన సాంప్రదాయాన్ననుసరించి కఱ్ఱ, కత్తి సాముల వంటివైనా నేర్చుకొని ఉండాలి. కరాటె వంటిదైనా కొంత సాధన చెయ్యటం మంచిది. ప్రాచీన వీరపురుషుల జయగాథలను పాడుకుంటు విజయయాత్రలుగా ఊరేగింపులు జరుపుకోవడం మంచిది.

జమ్మిచెట్టు రథాలు, బాణాలు మొదలైన వాటిని చేయటానికి అనువుగా - గట్టిగా ఉంటుందట. అందుకనే ఆ రోజు సాయంత్రం జమ్మిచెట్టు కొట్టి తెస్తూ ఉంటారు. జమ్మి ఆకులు పెద్దల చేతులలో పెట్టి పాదాలు మ్రొక్కి ఆశీస్సులు తీసుకుంటారు.

ఈ చెట్టును సంస్కృత భాషలో 'శమీవృక్ష' మంటారు. 'శమము' అనే పదానికి ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము అనే అర్థాలుకూడా ఉన్నాయి. తనలోని అరిషడ్వర్గాలను జయించినవాడే బయట శత్రువులను అణచగలుగుతాడు. కనుక పెద్దల ఆశీస్సులతో ముందుగా మనలోని కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను జయించాలి.

విజయకాంక్ష క్షత్రియులయందేగాక జన సామాన్యంలోనూ కనబడుతుంది. అందుచేతనే ప్రజలందరూ ఆయా వృత్తులకు చెందిన పనిముట్లను శుభ్రపరచుకొని పదును పెట్టుకుని అలంకరించి కర్పూర నీరాజనాల నిస్తారు. వాహనాలైన సైకిలు, స్కూటర్, కారు మొదలైనవాటిని అలంకరించుకుంటారు. కర్పూర నీరాజనాలకన్న ఘృత ఓషధులతో హోమం చేసుకొని హోమ వాయువులతో నీరాజనాలివ్వటం ఉత్తమం. పర్యావరణంకూడా శుద్ధమౌతుంది. సాయంత్రం అందరూ ఊరేగింపుగా ఊరు ఆవలకు వెళ్ళిరావటం, శమీపత్రాలు తెచ్చుకోవటం, మన ప్రాచీన వైభవాన్నీ, శ్రీరామ శ్రీకృష్ణ పాండవాదులను, మధ్యకాలీన రాణాప్రతాప్, వీర శివాజీ, ఝూన్సీలక్ష్మీబాయి, రాణి రుద్రమదేవి వంటి వీరులను, వీరవనితలను తలచుకొని ప్రేరణను పొందటం చేయాలి. మనం కూడా నియమంగా నిత్యం యోగ వ్యాయామ ప్రాణాయామాదులను, దండ బస్కీలను చేస్తూ శారీరక బలాన్ని, ఉన్నతిని పొందాలి. ఆత్మరక్షణకై కఱ్ఱసాము, కత్తిసాము, కరాటే వంటివి నేర్చుకోవాలి. అప్పుడే మనం విజయంకొరకు విజయదశమి పర్వాన్ని జరుపుకున్న వారమౌతాము. అస్తు.

# దీపావళి - హోమావళి

## మహర్షి దయానందుని నిర్వాణ దినం

దీపావళి అంటే దీపాల వరుస. వరుసగా ఎక్కువ దీపాలు వెలిగిస్తే అది దీపావళి అవుతుంది. మానవులకు ఎక్కువ సంతోషం కలిగినపుడు వారి శక్తి కొలది ఎక్కువ దీపాలను వెలిగించుకొని ఉత్సవాన్ని జరుపుకుంటారు. ఇంతేగాక, వైదిక సంస్కృతిలో దీపం జ్ఞానాన్ని సూచిస్తుంది. కనుకనే, సభా సమావేశాలు, విద్యా విజ్ఞానవేత్తలు జరుపుకునే సదస్సులు (Conferences) ప్రారంభించేముందు దీప ప్రజ్వలనచేసి వాటిని ప్రారంభిస్తారు. ఏ విధంగానయితే మనం వెలిగించే దీపం చీకటిని దూరం చేసి వెలుగునిచ్చి వస్తు జ్ఞానాన్ని కలిగిస్తుందో, అట్లే జ్ఞాన దీపం (జ్ఞానజ్యోతి) మన బుద్ధి గుహలోని అంధకారాన్ని పోగొట్టి వస్తు పరిజ్ఞానాన్ని, విషయ పరిజ్ఞానాన్ని కలిగిస్తుంది. కనుకనే, అప్పుడప్పుడు మనకు మంచి ఆలోచన (Idea) తట్టినపుడు "నా బుద్ధిలో లైటు వెలిగింది" అంటూఉంటాము కదా! అంటే, మన బుద్ధిలో జ్ఞానప్రకాశం కలిగినపుడు మంచి ఆలోచనలు వస్తాయి. అవి మనకెంతో మేలు చేకూరుస్తాయి. అప్పుడప్పుడు కలిగే ఆ జ్ఞాన ప్రకాశం మనకు నిత్యం కలిగితే మనకు నిత్యం దీపావళియే కదా!

నిజంగా దేవుడు మానవుల కిచ్చిన గొప్పవరం 'బుద్ధి'. అయితే, దానిని మనం వికసింప చేసుకుంటేనే మనకు లాభం కలుగుతుంది. బుద్ధిని శాస్త్రజ్ఞానంతో పదును పెట్టుకోమంటాయి మన వేద శాస్త్రాలు. శాస్త్రజ్ఞానం అంటే ముఖ్యంగా పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలు, ఋషులు వ్రాసిన దర్శనశాస్త్రాలు. ముఖ్యంగా ఆస్తిక దర్శనాలైన న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనాలు. జ్ఞాన పిపాసతో మనం వీటిని అధ్యయనం చేస్తే తప్పక మన బుద్ధి వికసిస్తుంది. తద్వారా మన కెంతో మేలు జరుగుతుంది. ఇంతేగాక, ఏది సత్యమో ఏది అసత్యమో, ఏది ధర్మమో ఏది అధర్మమో, ఏది కర్తవ్యమో ఏది అకర్తవ్యమో (ఏది చెయ్యనక్కర లేదో - చెయ్యకూడదో) తెలుస్తుంది. పయనించవలసిన జీవనమార్గం స్పష్టంగా కనబడుతుంది. ఆ మార్గంలో మనం పయనిస్తే ఇహలోక ఉన్నతియేకాక పరలోక ఉన్నతికూడా కలుగుతుంది. నిశ్శ్రేయసమైన మోక్షాన్ని - దుఃఖరాహిత్యాన్ని - పరమానంద ప్రాప్తిని కలిగిస్తుంది. మన జీవితం ధన్యమౌతుంది.

నేడు లోకంలో దీపావళిని గురించి ఒక కల్పిత కథ ప్రచారంలో ఉంది. శ్రీకృష్ణుని సమకాలంలో ప్రాగ్జ్యోతిష పురానికి (నేటి అస్సాం ప్రాంతానికి) రాజైన నరకాసురుడు దేశంలోని 16 వేల మంది అందమైన స్త్రీలను బలాత్కారంగా తన అంతఃపురానికి తీసుకువచ్చి బంధించి అనుభవిస్తూ ఉండేవాడట. అతని అత్యాచారాలను భరించలేక ప్రజలు శ్రీకృష్ణునికి విన్నవించుకొని మమ్ము రక్షించమని ప్రాధేయపడ్డారట. అప్పుడు శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై ప్రాగ్జ్యోతిషపురంపై దండెత్తి నరకాసురుని వధించి ఆ స్త్రీలందరిని బంధ విముక్తులను చేశాడని చెబుతారు. ఇంతేకాక బంధవిముక్తులను గావించిన స్త్రీల నందరనీ తానే పెండ్లి చేసుకున్నాడనీ కనుక శ్రీకృష్ణునకు 16 వేలు+8 మంది భార్యలనీ కూడా చెబుతారు. అందుకే, ఆశ్వీయుజ బ॥ చతుర్ధశిని నరక చతుర్దశిగా (నరకాసురుని వధించిన దినంగా) జరుపుకుంటారు. ఆ విజయంతో మరునాడు తిరిగి ద్వారకా నగరానికి వచ్చుచున్న శ్రీకృష్ణునకు ద్వారకానగర ప్రజలు తమ ఇండ్లను దీప పంక్తులతో అలంకరించి – అమావాస్య చీకటిని దూరం చేస్తూ స్వాగతం పలికారట. అప్పటి నుండి ఈ పర్వం (పండుగ) చేసుకొంటున్నట్లు చెబుతారు.

కాని, శ్రీకృష్ణ చరిత్రను అనేక కోణాలలో లోతుగా అధ్యయనం చేసిన కవులు, రచయితలు, స్వాతంత్ర్య సమరయోధులు, **'వందేమాతరం'** గీత రచయిత అయిన మాన్యశ్రీ బంకిమ్ చంద్ర చటోపాధ్యాయగారు **'శ్రీకృష్ణ చరిత్ర'** అనే చక్కటి గ్రంథాన్ని వ్రాశారు. అందులో వారు ఏమంటారంటే "శ్రీకృష్ణుని సమకాలంలో ప్రాగ్జ్యోతిషపురానికి రాజు నరకాసురుడు కాదు. ఆ కాలంలో ఆ దేశాన్ని భగదత్తుడు అనే రాజు పరిపాలించినట్లు మహాభారతంలో స్పష్టంగా వ్రాసి ఉంది. ఇంతేగాక, అతడు భారత సంగ్రామంలో కౌరవుల పక్షంలో యుద్ధం చేసి అర్జునుని చేతిలో హతమైనట్లు ఉంది. భగదత్తుడు గొప్ప వీరుడు. కౌరవ పక్షపాతియేకాని స్త్రీలోలుడు కాదు." అన్నారు.

ఇంతేగాక, బంకిమ్ చంద్రులవారు తమ గ్రంథంలో "శ్రీకృష్ణునకు ఎంతమంది భార్యలు?" అనే విషయంపై ప్రత్యేకంగా ఒక అధ్యాయం వ్రాశారు. దానిలో 243వ పుటలో తమ అంతిమ నిర్ణయాన్ని వ్రాస్తూ – "మహాభారతం యొక్క మౌళిక అంశను బట్టి చూస్తే శ్రీకృష్ణునకు 'రుక్మిణి' ఒక్కతియే పత్ని. ఆమెగాక మరొక స్త్రీతో వివాహమైనట్లే లేదు. రుక్మిణి యొక్క సంతానమే తదనంతరం రాజ్య సింహాసనాన్ని అలంకరించారు.

శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహం చేసుకొని వెంటనే బ్రహ్మచర్య వ్రతాన్ని తీసుకొని ఆమెతో కలిసి హిమాలయ పర్వత ప్రాంతంలోని బదరికా వనానికి చేరుకొన్నారు. అక్కడ పత్నితో ఉంటూ కూడా 12 సంవత్సరాలు కఠోరమైన బ్రహ్మచర్య తపస్సు చేశారు. అనంతరమే రుక్మిణితో సమాగమము జరిపి "ప్రద్యుమ్నుడ"నే పుత్రరత్నానికి జన్మ నిచ్చారు. అటువంటి మహానుభావునకు చాలా మంది భార్యలున్నారు, నరకాసురుని 16,000 మంది పత్నులను తాను పెండ్లి చేసుకున్నాడు అని చెప్పే కథలన్నీ 'నానీ కా కహానియాం' (కాకమ్మ - నానమ్మ) కథలే నన్నారు. రాధ యొక్క ప్రసక్తి కూడా కల్పితమే నన్నారు. ఆర్యసమాజ సంస్థాపకులు మహర్షి దయానంద సరస్వతిగారు కూడా తమ జగత్ప్రసిద్ధ "సత్యార్థ ప్రకాశ" గ్రంథంలో 11వ సముల్లాసంలో బంకిమ్ బాబుగారు వ్రాసినట్లే వ్రాశారు. శ్రీకృష్ణ భగవానుని చరిత్ర భాగవత గ్రంథం ద్వారానే కలుషితమయ్యిందని, విమతస్థుల విమర్శలకు గురియౌతున్నదని తమ ఆవేదనను వ్యక్తపరచారు.

ఉత్తర భారతదేశవాసులు దీపావళి పర్వాన్ని శ్రీరామ చరిత్రతో ముడిపెడతారు. 14 సంవత్సరాల వనవాస దీక్షను పూర్తిచేసుకొని తిరిగి శ్రీరాముడు అయోధ్యా నగరానికి చేరుకొన్న దినంగా దీపావళిని భావిస్తారు. అది కూడా సరికాదు. వాల్మీకి రామాయణాన్ని బట్టి శ్రీరాముడు అయోధ్యా నగరానికి తిరిగి వచ్చిన రోజు వైశాఖ మాసంలో వస్తుంది. అయితే ఈ దీపావళి పర్వ చరిత్ర ఏమిటో ఆలోచిద్దాము.

భారతీయ సంస్కృతి అగ్నిహోత్రంతో ముడిపడి ఉంటుంది. ఏ శుభకార్యం జరిగినా, ఏ సంతోషకరమైన విషయం జరిగినా ఆర్యులు విశేష హోమం చేసి ప్రాకృతిక దేవతలకు - అగ్ని వాయు ఆదిత్య జల పృథివీ దేవతలకు ఆహుతు లర్పిస్తారు. పొలాల నుండి పంటలు ఇంటికి వచ్చినా ముందు అగ్నిహోత్రంలో ఆ యా ధాన్యాలను ఆహుతులుగా యిచ్చి తదుపరియే వారు వండుకొని భుజిస్తారు. అటువంటి హోమాలను **'నవసస్యేష్టి'** అంటారు. ఆశ్వీయుజ బ॥ అమావాస్య నాటికిని కొన్ని పంటలు పండి యింటికొస్తాయి. వాటితో ఆర్యులు నవ సస్యేష్టి చేస్తారు. ఇది శరద్ ఋతువులో వచ్చే నవసస్యేష్టి కనుక దీనిని **'శారదీయ నవ సస్యేష్టి'** అంటారు. అది అందరూ ఆశ్వీయుజ అమావాస్యనాడు హోమావళిగా జరుపుకునేవారు. నాటి హోమావళి నేడు దీపావళిగా మార్పుచెందింది. కాలక్రమంలో మన వైదికధర్మం - వైదిక సంస్కృతి అనేక ఆటుపోట్లకు గురియై నిత్యాగ్నిహోత్రం నిత్య దీపారాధనగా సంకుచితమై పోయినది. అగ్నిహోత్రంతో ప్రారంభింపబడే శుభకార్యాలు నేడు

దీపారాధన చేసి ప్రారంభింప బడుతున్నాయి. అగ్నిహోత్రం చేసి సంస్కరించవలసిన పంచభూతాలను దీపం వెలిగించి సంస్కరించగలమా? అది ఎట్లు ?

ఈ దీపావళి దినముననే ఆర్యసమాజ సంస్థాపకులు మహర్షి దయానంద సరస్వతీ స్వాములవారు దివంగతులయ్యారు. అందుచే ఆర్యసమాజికులు హోమావళిగా నవసస్యేష్టి చెయ్యటమే కాక ఋషినిర్యాణ దినంగా కూడా జరుపుకుంటారు. ఎలాగయితే దీపం తాను తపిస్తూ చివరిక్షణం వరకు లోకానికి వెలుగును ప్రసాదిస్తుందో అట్లే, దయానంద మహర్షి చివరి క్షణం వరకు లోకానికి జ్ఞానతేజాన్నిచ్చారు. అనేక పర్యాయాలు తనకు విషప్రయోగం జరిగినా తాను పట్టిన జ్ఞాన వ్రతాన్ని - వేదధర్మ ప్రచారాన్ని విడువలేదు. చీకటిలో జీవించే జీవులకు వెలుతురంటే గిట్టదు. సూర్యున్ని అవి శత్రువుగా భావిస్తాయి. అట్లే స్వార్థంతో మూఢనమ్మకాలను పెంచి పోషించే పౌరాణిక పండితులకు వేదసూర్యుడంటే గిట్టలేదు. పరిణామంగా దయానంద మహర్షిని అంతం చెయ్యగలిగారే కాని ఆ మహర్షి స్థాపించిన **ఆర్యసమాజాన్ని**, వ్రాసిన వేద సాహిత్యాన్ని అంతం చెయ్యలేకపోయారు. అవి యిప్పటికీ వేద ప్రచారం చేస్తూనే ఉన్నాయి. ఇకముందును, ఎప్పటికినీ అవి వేదప్రచారం చేస్తూనే ఉంటాయి. అస్తు

## ఆర్యసమాజ మూడవ నియమము

వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట చదివించుట, వినుట వినిపించుట (ఆచరించుట ఆచరింపజేయుట) ఆర్యులందరికిని పరమ ధర్మము. **- మహర్షి దయానంద సరస్వతి**

Vedas are the scriptures of true knowledge. It is the first duty of the Aryas to read them, teach them, recite them and hear them being read. **- Maharshi Dayananda Saraswathi**

'ఆర్య' పదం జాతివాచకం (Race) కాదు. ఆర్యుడంటే "ఉత్తముడు, ధర్మాత్ముడు, కర్తవ్యపరాయణుడు" అని అర్థం.

"తమసో మా జ్యోతిర్గమయ"
అందరికీ దీపావళి శుభాకాంక్షలు

# క్రాంతిని ప్రేరేపించే సంక్రాంతి

సంక్రాంతి పర్వం (పండుగ) సృష్టిలో జరిగే ఒక మార్పును సూచిస్తుంది. మనం నివసించే ఈ భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉంటుందనే విషయం మన అందరికి తెలిసినదే. భూమి తన చుట్టూ తాను తిరగటానికి దినం (24 గంటలు) పడుతుంది. సూర్యునిచుట్టు తిరిగి రావడానికి ఒక సంవత్సరం పడుతుంది. ఈ సూర్యుని చుట్టూ చేసే భ్రమణం సరిగా గుండ్రంగా కాక కోలగా (కోడిగ్రుడ్డు ఆకారంగా) ఉంటుంది. ఇంతేకాక, భూమి $23\frac{1}{2}$ డిగ్రీలు ఏటవాలుగా తిరుగుతూ 6 నెలలు ఉత్తరధ్రువం సూర్యునివైపు వంగుతూ, మరొక 6 నెలలు దక్షిణధ్రువం సూర్యునివైపు వంగుతూ తిరుగుతుంది. అందువల్లనే భూమిపై ఋతువు లేర్పడుతున్నాయనీ, ధ్రువ ప్రాంతాలలో 6 నెలలు పగలు, 6 నెలలు రాత్రీ ఏర్పడుతున్నాయనీ, ఉత్తరాయణ దక్షిణాయనాలు ఏర్పడుతున్నాయనీ వైజ్ఞానికులంటారు.

మన ప్రాచీన ఖగోళవేత్తలు ఖగోళాన్నంతా ఒక వృత్తంగా (వలయంగా) భావించి దానికి కాంతివృత్తమని పేరుపెట్టారు. ఆ కాంతివృత్తాన్ని 12 భాగాలుగా చేసి వాటిని రాశులన్నారు. ఒక్కొక్క రాశి భాగంలో లక్షలకొలది నక్షత్రాలుంటాయి- నక్షత్రరాశులన్నమాట. అందులో ప్రకాశించేవి మనకంటికి కనబడతాయి. ఆ ప్రకాశ నక్షత్రాలు ఒక ఆకారాన్ని కల్పిస్తాయి. ఆ యా ఆకారాలనుబట్టి ఆ యా రాశులకు మేషం, వృషభం, మిథునం, కర్కాటకం, సింహ, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం అనే 12 పేర్లుపెట్టారు. మనం సంక్రాంతి పండుగగా వ్యవహరించే రోజున సూర్యుడు ధనుస్సు రాశిని విడిచి మకర రాశిలో ప్రవేశించి ఒక నెలరోజులు ఆ రాశిలో ఉంటాడు. ఇంతేకాక, ఈ దినం నుండే భూమి ఉత్తరధ్రువాన్ని సూర్యునివైపు వంచటం ప్రారంభిస్తుంది. భూమిపైనున్న మనకు ఉత్తరాయనకాలం ప్రారంభమౌతుంది. సూర్యోదయం దక్షిణదిశనుండి ఉత్తరదిశకు జరుగుతూ ఉన్నట్లు కనబడుతుంది. పగటి పరిమాణం క్రమంగా పెరుగుతుంది. వాత శ్లేష్మ తత్వాలవారి బాధలు క్రమంగా ఉపశమిస్తాయి. అందుకనే ప్రజలు ఉత్తరాయణాన్ని పుణ్యకాలంగా భావిస్తారు. యథార్థంగా ఈ ఉత్తరాయణం (మకర

సం(క్రమణం) డిసెంబరు 22వ తేదీనాడే ప్రారంభమౌతుంది. కాని, ఎందుచేతనో **ఫలిత జ్యోతిష్కులు** జనవరి 14వ తేదీని మకర సం(క్రమణం అంటున్నారు!

సం(క్రాంతి పర్వం ప్రాకృతికంగా భూ(భ్రమణంలోని ఒక మార్పును సూచించే పండుగే అయినా అది మనకెంతో చక్కటి క్రాంతి సందేశాన్నిస్తున్నది. 'క్రము-పాదవిక్షేపే' అనే సంస్కృత మూల ధాతువుతో 'క్రాంతి' పదము ఏర్పడుతుంది. కనుక, క్రాంతి అంటే అడుగు ముందుకి పయనించటం-పురోగమించటం. దానికి 'సం' ఉపసర్గ చేర్చి 'సం(క్రాంతి' అన్నారు. 'చక్కటి పురోగమన' మని దీని అర్థం.

**"పురోగమన మంటే ఏమిటి?"** ఇది ఆలోచించవలసిన విషయం. కొందరు ఆర్థికంగా, రాజకీయంగా ఎదగటమే పురోగమన మంటారు. కొందరు శాస్త్ర సాంకేతిక రంగాలలో ఉన్నతి చెందటమే పురోగమన మంటారు. మరికొందరు నాగరికులమై సమసమాజాన్ని నిర్మించటమే పురోగమన మంటారు. ఇవన్నీ ఆంశికంగా పురోగమనాలే. కాని, సమగ్ర పురోగమన మేది? దీనికి సృష్టికర్త యిచ్చిన వేదజ్ఞాన మేమంటుందో చూద్దామా!

**తంతుం తన్వన్ రజసో భానుమన్విహి**
**జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్ ।**
**అనుల్బణం వయత జోగువామపో**
**మనుర్భవ జనయా దైవ్యం జనమ్ ॥** - ఋగ్వేదం (10-53-6)

ఓ కర్మయోనిని బొందిన మానవా! ఆకాశంలో గ్రహఉపగ్రహాలతోగూడి పయనించు సూర్యుని నీవు అనుకరించు. 'కర్మ' లనే దారాలతో 'జీవిత'మనే వస్త్రాన్ని నిర్మించుకో. అది నీ చేతిలో ఉంది. 'వైదిక సంస్కృతీ సభ్యత" లనే ఋషి నిర్మిత వెలుగు బాటలను సదా రక్షించు. అనుసరించు. నిరంతరం సత్కర్మానుష్ఠాన పరుడవు కమ్ము. మనన శీల మానవుడవై దివ్యమానవ సమాజాన్ని నిర్మించు.

**'తంతుం తన్వన్ రజసో భానుమ్ అన్విహి'**

దారాలతో వస్త్రాలను నేయు ఓ మానవుడా! గ్రహాలతో కూడి పయనించు సూర్యుని అనుసరించు.

ఈ మాట చాలామందికి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కాని, ఇది సత్యం. నేతపనివారు పడుగుపేకలతో- పొడుగు మరియు అడ్డ దారాలతో వస్త్రాలను నేయునట్లే

మానవులు 'మంచి కర్మలు మరియు చెడు కర్మలు' అనే దారాలతో జీవితమనే వస్త్రాన్ని సదా నేస్తూనే ఉంటారు. మన ఇప్పటి ఈ జీవితానికి పూర్వం మనం చేసిన కొన్ని మంచి చెడు కర్మల సమిష్టి రూపమే కారణం. ఎవరు పూర్వం సత్కర్మలు ఎక్కువగా చేసి ఉంటారో వారి జీవితం అంత సుఖమయంగా సాగిపోతుంది. ఎవరి పూర్వకర్మలు మంచివికావో వారి జీవితం కష్టాలతో సాగుతూ ఉంటుంది. అవి ఈ జన్మలో చేసిన కర్మలే కానక్కరలేదు. పూర్వ జన్మలలోనివి కావచ్చు. పుణ్యకర్మలను తెల్లదారాలతోను, పాపకర్మలను నల్లదారాలతోను పోల్చవచ్చు. తెల్లదారాల సంఖ్య ఎంత ఎక్కువగా ఉంటే అంతగా ఆ వస్త్రం తెల్లగా ప్రకాశిస్తూ ఉంటుంది. నల్లదారాల సంఖ్య ఎక్కువైతే నల్లగా వికారంగా వస్త్రం తయారౌతుంది. జీవితం కూడా అంతే.

అందుచే పరమేశ్వరుని ఉపదేశమేమంటే – **'రజసో భానుమ్ అన్విహి'** ఆకాశంలో గ్రహాలతోకూడి – వాటిని తన ఆకర్షణ శక్తితో పట్టుకొని పయనించు సూర్యుని అనుసరించు. సూర్యుడు ఏ గ్రహాన్నీ తనలోనికి ఆకర్షించి మండించి మసిచెయ్యడు. వాటిని పట్టుకొని తానును మిల్కీవే గెలాక్సీ కేంద్రాన్ని చుట్టి వస్తున్నాడు. అలాగే మనం కూడా మానవ సమాజంలో ఎవరికీ నష్టం చేయకుండా మన లక్ష్యంవైపు పయనించాలి. ఇంతేగాక, తోటివారు కూడా ఉన్నతిపొంద సహకరించాలి.

**'జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్'**

పూర్వపు మేధావులు నిర్మించిన వెలుగుబాటలను నీవు రక్షిస్తూ ఉండు.

మనకన్న పూర్వులైన మేధావులు– అంటే ఋషులు, మునులు, మహాత్ములు. వారు మానవోన్నతికి కొన్ని చక్కటి మార్గాలను నిర్మించారు. షోడశ సంస్కారాలు, చతురాశ్రమాలు, వర్ణాశ్రమ ధర్మాలు, పంచ మహాయజ్ఞాలు మొదలైనవే ఆ వెలుగు బాటలు. వాటిని మనం చెడగొట్టక వీలైనంతగా వాటిని రక్షించాలి. అంటే – మనం వాటిని అనుసరిస్తూ ఇతరులకు ఆదర్శంగా ఉండాలి. (వీటిని గురించి రాబోవు పండుగలలో వివరంగా తెలుసుకొందాము).

**'అనుల్బణం వయత జోగ్వామ్ అపః'** ఎప్పుడూ – ఎడతెగకుండా సత్కర్మలనే చేస్తూ ఉండు. పరమేశ్వరుని మరొక ఉపదేశ మేమంటే – నీ భావి జీవితానికి, ఉన్నతికి సత్కర్మలే కారణమని గుర్తించి సదా సత్కర్మలనే చేస్తూ ఉండు. ఆ పనిలో విరామం వద్దు.

**'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః'** "సత్కర్మలు చేస్తూనే నూరేండ్లు జీవించగోరు. సత్కర్మల ఫలాన్ని పరమేశ్వరున కర్పించి కర్మబంధనాన్నుండి విముక్తిని పొందు. అప్పుడే నీవు పరమానందరూప ముక్తిని పొందగలవు" అంటుంది యజుర్వేదం (40-2).

**'మనుర్భవ, జనయా దైవ్యం జనమ్'** మననశీల మానవుడవై దివ్యమానవ సమాజాన్ని నిర్మించు. ఇదే ఈ మంత్రంలో సృష్టికర్తయిచ్చు చివరి సందేశం. మనమంతా ఆకారంలో మానవులుగా ఉన్నామేకాని మనలో మానవత్వ మెంత ఉందో ఎప్పుడైనా ఆత్మ విమర్శ చేసుకొన్నామా? మానవత్వానికి మహర్షి మనువు చెప్పిన దశ లక్షణాలు మనలో ఎంతెంత శాతంలో ఉన్నాయి? అవి ఏవంటే -

శ్లో॥ **ధృతిః క్షమా దమోఽ స్తేయం శౌచ మింద్రియ నిగ్రహః ।**
**ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥** - మనుస్మృతి (6-92)

ధృతిః - ధైర్యాన్ని కలిగి ఉండటం, క్షమా - సహనశీలత, దమః - మనోనిగ్రహం, అస్తేయం - దొంగతనం చెయ్యకుండా ఉండటం. శౌచం - బాహ్యాభ్యంతరాలు శుద్ధంగా ఉంచుకోవటం, ఇంద్రియ నిగ్రహం - ఇంద్రియాలను తన వశంలో పెట్టుకోవటం, ధీః - బుద్ధితో ఆలోచించి పనులు చేయటం, విద్యా - తన స్వరూపాన్నీ, ప్రపంచ స్వరూపాన్ని చక్కగా తెలుసుకోవటం, సత్యమ్ - సత్యమునే పలకటం, ఆచరించటం. అక్రోధః - కోపము, పగ, కక్ష లేకుండటం. ఈ పది లక్షణాలు కలిగి ఉండటమే మానవ ధర్మం. (వీటిని గురించి వివరంగా తెలుసుకోగోరువారు నా రచన మానవధర్మం" చదువగోరుచున్నాను).

**'జనయా దైవ్యం జనమ్'** నీ వొక్కడవే పై పది గుణాలను పెంచుకుంటూ ఉన్నతి చెందటం కూడా పూర్తిగా మంచిది కాదు. నీ జ్ఞానాన్ని ఇతరులకు పంచి వారి ఉన్నతికి కూడా కృషి చెయ్యమని సృష్టికర్త సందేశం. కనుకనే మహర్షి దయానందులవారు - **"ప్రతి వ్యక్తియు తన ఉన్నతితోనే సంతృప్తి చెందక అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి కలదని నమ్మవలెను. (భావించవలెను)"** అన్నారు. వారు స్థాపించిన ఆర్యసమాజానికి దశనియమాలు ఏర్పరచి, వాటిలో దీనిని 9వ నియమంగా నిర్దేశించారు.

ఈ వేద మంత్రంలోని 'భానుమన్విహి - సూర్యుని అనుసరించు' అనే

మాటలోని అంతరార్థం ఇదే. చక్కటి క్రాంతి మార్గంలో పయనించ మనటమే. సృష్టికర్త యిచ్చే సంక్రాంతి సందేశం. క్రాంతితోనే శాంతి లభిస్తుంది. ఆనందం లభిస్తుంది.

క్రాంతిరస్తు - శాంతిరస్తు - ఆనంద ప్రాప్తిరస్తు.

# శివరాత్రి - బోధరాత్రి - జ్ఞాన రాత్రి

**"శివు కల్యాణే"** అను ధాతువుతో శివ పదం తయారౌతుంది. కల్యాణ స్వరూపుడు, కల్యాణకారి యగుటచే పరమేశ్వరునకు శివుడని పేరు. కల్యాణకారుదనగా మేలు చేయువాడని అర్థం. పరమేశ్వరుడు సదా జీవులందరికి మేలు చేయుచుండును. జీవుల మేలుకొరకు సూక్ష్మ రూపంలో విడివిడి పరమాణువులుగా ఉన్న ప్రకృతిని పరమేశ్వరుడు తన అనంత జ్ఞాన సామర్థ్యాలతో అత్యంత రమణీయంగా విజ్ఞానయుక్తంగా మలచి యీ సృష్టిని గావించెను. బహు ప్రజ్ఞతో ప్రాణుల శరీరాలను నిర్మించి జీవులు భోగించుటకై ఇంద్రియాలను, మనస్సును నిర్మించియిచ్చెను. అందు ఉత్తమ ప్రాణిగా మానవ శరీరాన్ని నిర్మించెను. వికసించిన యింద్రియాలతో, వికసించిన బుద్ధితో నిర్మింపబడిన మన ఈ మానవ శరీరాలు పరమేశ్వరుని రచనయే. తన ఆద్భుత సృష్టివలన మానవులు మరింత ప్రయోజనం పొందుటకై సృష్టిరహస్యాలనన్నింటిని వేదం ద్వారా ఉపదేశించెను. అలసిన శరీర మనస్సులను నిద్రపుచ్చి నవచైతన్యాన్ని ప్రసాదించును. అనన్య భక్తితో సేవించేవారికి దివ్యానందము నొసగును. తీవ్ర వైరాగ్యం బొందినవారిని శరీర బంధం నుండి, జనన మరణాల నుండి విముక్తుల జేసి కోట్ల సంవత్సరాలు తన తృతీయ ధామంలో ఆనంద డోళికల నోలలాడించును. కనుక సర్వ వ్యాపకుడైన ఆ పరమేశ్వరునకే శివుడను సార్థక నామధేయం గలదు.

ఆ శివునకు ఈశుడు, ఈశ్వరుడు, పరమేశ్వరుడు, శంకరుడు, మహాదేవుడు, రుద్రుడు మొదలగు పేర్లు కూడా గలవు. ఈ నామము లన్నియు అతని గుణ కర్మములు తెలుపునట్టివే.

పరమేశ్వరుడు తన అద్భుత సామర్థ్యంతో పరమాణువులలో అణుబంధనాన్ని (chemical bond) యేర్పరచి వివిధ పదార్థాలను సృజించెను. కొన్ని ప్రకృతి సూత్రాల

(physical Laws) తో గ్రహగోళాలను బంధించి వాటిని నియమ బద్ధంగా నడుపుచు అందు వసించు ప్రాణుల జీవన యాత్రలను పరిరక్షించు చుండును. కనుక పరమేశ్వరునకు **'ఈశుడు'** (ఈశ-నియమనే) నియామకుడు అను పేరు కలిగినది. మనము కష్టించి సంపాదించి నిర్మించిన వస్తువులు మన ఐశ్వర్య మగును. అట్లే పరమేశ్వర నిర్మితమైన యీ బ్రహ్మాండము, అందలి సమస్త పదార్థములు అతని ఐశ్వర్యమగును. అందుచే భగవంతునకు (ఇది-ఐశ్వర్యే) **'ఈశ్వరు డని** పేరు'. అతని ఐశ్వర్యము శ్రేష్ఠమైనదనియు, గొప్పదియు నగుటచే **'పరమేశ్వరు'దని** మరియొక పేరు. జీవులందరకు శం - సుఖమును కలుగజేయువాడు గనుక ఈశ్వరునకు **'శంకరు'** డని పేరు. దివ్య గుణములు గలిగిన జడ చేతన దేవతలలో గొప్పవాడుగా ప్రకాశించును గనుక పరమేశ్వరునకు **'మహాదేవు'** డని పేరు కలిగినది. ఆ శివుడు జీవుల అంతర్యామియై పాపకార్యాలొనర్చు నపుడు భయాందోళనలను కలిగించి దుఃఖములపాలు గాకుండా హెచ్చరించు చుండును. ఆ అంతర్యామి ప్రేరణను లెక్కచేయక పాపము లొనర్చిన బాగుపడ వలెనను దృష్టితో తల్లివలె దండించి (కష్టముల నిచ్చి) మంచి మార్గమున నడుపుటకు యత్నించును. ఇంకను వినకున్న రుద్రుడై శిక్షించి సంస్కరించును. అందుచేతనే పరమేశ్వరునకు (రుద - రోదనే) **'రుద్రు'** డని మరియొక పేరు.

ఇవి యన్నియు శివ నామములే. అత దనంత సామర్థ్య యుక్తుడగుటచే అతని పేర్లను అనంతములుగానే యుండును. అందు ముఖ్యమైన 108 పేర్లను వేదము పేర్కొనును. పొరబడకుండుటకు అవి యన్నియు ఏకేశ్వరుడైన పరమేశ్వరునివే **'ఏకం సద్విప్రా బహుధా వదన్తి'** (ఋ. 1-164-49) యని వేదము చెప్పును.

భగవంతుని ఈ నామము లన్నియు యౌగికములే. అనగా మూల ధాత్వర్థమునే ప్రకటించును. ఆ శివునికే బ్రహ్మ, విష్ణువు, గణపతి మొదలగు పేర్లు కూడా గలవు. బ్రహ్మ యనగా అన్నిటికన్న గొప్పవాడు. విష్ణు వనగా (విశ్లృ-వ్యాప్తౌ) అంతట వ్యాపించి యుండువాడు. గణపతి యనగా (గణ - సంఖ్యానే) లెక్కించ వీలైన జీవ గణములకు ఆధిపతి. కాని, నేడు పురాణాల ప్రభావం వలన, తదను గుణంగా వ్రాసిన కవిత్వాలు, పాటలు, నాటికలు, కథలు మొదలగు వాని వలన, వాటికి రూప మిచ్చుటకు రవివర్మాదులు వేసిన చిత్ర పటాల వలన, నిర్మించిన దేవాలయాల వలన, ఆ పంథాలోనే నడచుచున్న నాటకాలు, సినిమాల వలన

పరమేశ్వరుని ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క రూపము, ఒక్కొక్క చరిత్ర మన మనస్సులో స్ఫురించుచుండును. గాని ఈశ్వరుడు ఒక్కడే. అతడు సర్వ వ్యాపకుడు, నిరాకారుడు.

అట్టి ఈశ్వరునకు ప్రతిమను (లింగమును) ఏర్పరచి అభిషేకాది షోడశోపచార పూజలెందుకు? శివరాత్రి ఉపవాస జాగరణ లెందుకు? అట్టి పూజల వలన ఎందరికి జ్ఞానోదయ మైనది? ఎవరికి జ్ఞానోదయమైననూ కాకున్ననూ మహర్షి దయానందునకు శివరాత్రి రోజుననే వివేకబోధ కలిగినది. శివరాత్రి దినమున కొన్ని ఎలుకలు శివలింగముపైకెక్కి ప్రసాదము నారగించుచు, గంతులువేయుచు, మలమూత్రములను విడుచుట చూచిన దయానందుడు ఈ లింగము నిజమైన శివుడు కాడని తెలుసుకొని, నిజమైన శివదర్శనము కొఱకు యిల్లు వదలి వెడలెను. ఎందరెందరో యోగులను కలుసుకొని ఎన్నెన్నోతపముల నాచరించి సమాధి నిష్ఠుడై సర్వవ్యాపక శివుని దర్శించెను. మరుగున పడిన ఆ శివజ్ఞానమైన వేదాలను వెలుగులోనికితెచ్చి ప్రపంచమునకు మహోపకారము చేసెను. ఆర్యసమాజాన్ని స్థాపించి స్త్రీ శూద్రులకును వేదజ్ఞానము నందించెను. అందుచేతనే ఆర్యసమాజీయులు శివరాత్రిని బోధరాత్రిగా జరుపుకొందురు. మీరంతా ఈ బోధరాత్రి ఉత్సవములో పాల్గొని నిజమైన శివదర్శనము చేయించగల అద్భుత వేదజ్ఞానము నందుకొనుడు.

## వేదోక్త పరమేశ్వర స్వరూపము

**1. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, నిరాకారుడు :**

**'ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'** (యజుర్వేదం 40-1)

ఈ చలాయమాన జగత్తంతయు అణువు మొదలు బ్రహ్మాండము వరకు ఈశునిచే (పరమేశ్వరునిచే) వ్యాప్తమై యున్నది. ( గాన అతనికి ఆకారము ఉండదు. )

**స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం శుద్ధ మపాపవిద్ధమ్ ।**
**కవి ర్మనీషీ పరిభూః స్వయంభూ ర్యాథా తథ్యతోఽ ర్థాన్,**
**వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥** (యజుర్వేదం 40-8)

ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, స్థూల - సూక్ష్మ - కారణ శరీర రహితుడు, వ్రణములు - ఛిద్రములు - లోపములు లేనివాడు. స్నాయుబంధ నములోనికి (జన్మలలోనికి) రానివాడు. పవిత్రుడు, సర్వపాపరహితుడు. వేద రచయిత. మనస్సులన్నిటికి సాక్షి. దుష్టులందరిని సంహరించగలవాడు. స్వయం భువుడు.

అట్టి ఈశ్వరుడే తనవలె నిత్యులై అల్పజ్ఞులు, అల్పశక్తి సామర్థ్యములుగల జీవులకొఱకు ఈ ప్రపంచ పదార్థముల నన్నిటిని యాథాతథముగా (ఎట్లు ఉండవలెనో అట్లు) నిర్మించెను.

**2. <u>ఈశ్వరునకు ప్రతిమ (విగ్రహము) లేదు :</u>**

**న తస్య ప్రతిమా అస్తి, యస్య నామ మహద్యశః ।**
**హిరణ్యగర్భ ఇత్యేష, మా మా హింసీ దిత్యేషా, యస్మాన్న జాత ఇత్యేషః ॥**

(యజుర్వేదం 32.3)

ఏ పరమేశ్వరునకు గొప్ప యశస్వంతమైన విఖ్యాతిగలదో అతనికి ప్రతిమ - విగ్రహము లేదు. ఏలనన అతడు హిరణ్యగర్భుడు - ప్రకాశ అప్రకాశకవంతమైన ఈ సమస్త బ్రహ్మాండమును తనలో గర్భముగా ధరించియున్నవాడు. అతని వేదాజ్ఞలను హింసించవద్దు - తిరస్కరించ వద్దు. అతడు జన్మించడు - అవతారములనెత్తడు. అట్టి సర్వవ్యాపకుడు నీలో అంతర్యామియై అతి సమీపమున నున్నాడు. అతనినే ఉపాసించి దివ్యానందము నొందుము.

**3. <u>ఈశ్వరు డొక్కడే - అనేకులు లేరు :</u>**

**న ద్వితీయో న తృతీయ శ్చతుర్థోనాప్యుచ్యతే**
**న పంచమో న షష్ఠః సప్తమో నాప్యుచ్యతే**
**నాష్టమో న నవమో దశమో నాప్యుచ్యతే**
**స ఏష ఏకవృదేక ఏవ॥**

(అథర్వవేదం 13-4-16, 17, 18, 20)

**నమః శివాయ చ శివతరాయ చ ॥**

# హోళీ హోమం ఆరోగ్యకరం

**శ్లో॥ అర్ధపక్వ శమీ ధాన్యైః + తృణభ్రష్టైశ్చ హోలకీః,
హోలకీ + అల్పానిలో మేదః కఫదోషశ్చ అపహా,
భవేద్యో హోలకీ యస్య స తత్తద్గుణో భవేత్ ॥**

- భావ ప్రకాశం (ఆయుర్వేద గ్రంథం)

అంటే - "అర్ధపక్వ శమీధాన్యాన్ని (యవలు లేక గోధుమలను) హోలకీ అంటారు. అట్టి హోలాలతో మందాగ్నిలో (అగ్నిహోత్రంలో) ఆహుతులుగా యిస్తే అందుండి వెడలు వాయువులవల్ల మేధ (శరీరంలో అధికంగా పేర్కొన్న క్రొవ్వు) కరిగి బయటకు వెడలిపోతుంది. ఇంతేగాక, అది కఫదోషాన్ని, అధిక శ్రమవల్ల కలిగిన ఆయాసాన్ని - నీరసాన్ని పోగాడుతుంది." అని ఆయుర్వేదం చెబుతున్నది.

అర్ధపక్వ శమీధాన్యం అంటే సగం పక్వమైన లేదా సగం పండిన ధాన్యం, 'శమీ' అనే పదం కేవలం శమీధాన్యానికే గాక తినదగిన అన్నిరకాల పప్పుధాన్యాలకు, కాయధాన్యాలకు వర్తిస్తుంది. పక్వం అనే పదానికి అగ్నిపక్వం, సూర్యపక్వం అని రెండు రకాలుగా అర్థం చెప్పుకోవచ్చు. కందులు, పెసలు, శనగలు మొదలైన పంటలను అవి పూర్తిగా ముదరకుండా (పండకుండా) లేతగా ఉండే సమయంలో అర్ధపక్వమైనవి అంటారు. వాటిని వండకుండానే నేరుగా తినవచ్చు. పల్లె ప్రాంతాలలో ఉండేవారికి ఇది అనుభవైక వేద్యమే. అవి రుచిగా ఉండటమేకాక తేలికగా జీర్ణమై మనకు పుష్టిని, శక్తిని కలిగిస్తాయి. కొందరు వాటిని గడ్డిమంటపై కొద్దిగాకాల్చి తింటారు. అటువంటి - వాటిని హోలాలంటుంది వ్యాకరణ శాస్త్రం -

**"తృణాగ్ని భ్రష్టార్ధ పక్వ శమీధాన్యం హోలకః, హోలా ఇతి హిందీభాషా"** అంటుంది శబ్ద కల్పద్రుమకోశం. అటువంటి హోలాలతో చేసే యజ్ఞాన్ని (అగ్నిహోత్రాన్ని) "హోళీహోమం" అంటారు. ఇంతేగాక, మన ప్రాచీనులు పంటలు పొలం నుండి ఇంటికి వచ్చిన తదుపరి వారు వెంటనే వాటిని వండుకొని తినకుండా, ముందు కొన్ని ధాన్యాలను హోమంలో ఆహుతులుగా అర్పించి తరువాత తినేవారు.

ఇటువంటి విశేష యజ్ఞాలను 'నవసస్యేష్టి' అంటాయి మన శాస్త్రాలు. హోలీ పండుగనాడు కూడా నవసస్యేష్టియజ్ఞం చేయాలంటారు ఋషులు.

**శ్లో॥ సస్యాన్తే నవసస్యేష్ట్యా తదా + ఋత్వన్తే ద్విజః + అధ్వరైః ।**

– మనుధర్మశాస్త్రం (4–26)

ద్విజులు (రెండవసారి విద్యాగర్భంనుండి పుట్టినవారు) అంటే – విద్యాసదాచారాలు కలిగిన వారంతా ఋతువుల చివరలో (ఋతువులు మారుతున్నపుడు) క్రొత్త పంటలతో నవసస్యేష్టియజ్ఞం చేయ్యాలంటాయి ధర్మశాస్త్రాలు, గృహ్యాసూత్రాలు. ఇట్టి యజ్ఞాలు చేయటంవల్ల పంటలను ప్రసాదించిన పంచభూతాలకు, తోటి ప్రాణులకు కృతజ్ఞతలు తెలిపినట్లవుతుంది. మన యోగేశ్వర శ్రీ కృష్ణుడు ఈ విషయం భగవద్గీతలో (3–10 నుండి 16 శ్లోకాలలో) ఎంత చక్కగా వివరించి చెప్పాడో చూడండి–

**శ్లో ॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।**
**అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్ ॥**

సృష్ట్యాదిలో ప్రజలను పాలించి పోషించే ప్రజాపతియైన పరమేశ్వరుడు (సృష్టికర్త) మానవులతోబాటు యజ్ఞాలను సృజించి ఇట్లుపదేశించాడు – "ఓ మానవులారా! ఈ వివిధ యజ్ఞాల ద్వారా మీమీ కోరికలను నెరవేర్చుకోండి. ఇవి మీ కోరికలను తీర్చే కామధేనువులు".

**శ్లో॥ దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమ్ అవాప్స్యథ ॥**

ఈ యజ్ఞాలతో దేవతలు భావన చేయబడతాయి. అంటే – జడదేవతలైన పృథివ్యాపస్తేజో వాయురాకాశాలు (పంచ భూతాలు) శుద్ధి చేయబడతాయి. ఆ విధంగా శుద్ధిచేయబడిన పంచభూతాలు మిమ్ము శుద్ధులుగా, ఆరోగ్యవంతులుగా, బలిష్ఠులుగా చేస్తాయి. ఈ విధంగా పరస్పరం భావనచేసుకుంటూ (శుద్ధిచేసుకుంటూ) ఉత్తమ శ్రేయస్సును పొందండి. (ఆయుర్వేద పరిభాషలో 'భావన చెయ్యటం' అంటే

శుద్ధి చేయటం. ఉదా : గంధకాన్ని కొన్ని మూలికారసాలతో కలిపి కల్వంలో బాగా మర్దన చేస్తారు. అప్పుడు అది మందుగా లోపలికి సేవించవచ్చును. ఇట్టి శుద్ధి చేసిన గంధకాన్ని – 'భావన గంధకం' అంటారు. ఆ విధంగా యజ్ఞాలతో పంచభూతాలు శుద్ధిచేయబడతాయి.)

**శ్లో ॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।**
**తైర్దత్తాన్ అప్రదాయ+ ఏభ్యః యః భుంక్తే స్తేన ఏవ సః ॥**

యజ్ఞాలతో భావన చేయబడిన దేవతలు మీకు కావలసిన భోగాలను – ఆహారాది జీవన నిర్వహణ సుఖాలను ప్రసాదిస్తాయి. ఆ విధంగా వాటినుండి ఉపకారం పొంది మరల వాటికి ఆహుతుల నివ్వకపోతే వారు దొంగిలించినవారే ఔతారు.

**శ్లో॥ యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే తు+ అఘం పాపా యే పచంతి+ఆత్మకారణాత్ ॥**

యజ్ఞానంతరం మిగిలిన పదార్థాలను తినేవారు సర్వపాపాలనుండి విముక్తులౌతారు. అట్లుకాక, ఎవరు కేవలం తమకొరకే అన్నాదులను వండుకొని తింటారో వారు పాపమును మాత్రమే భుజించినవారౌతారు.

**శ్లో॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యాత్ అన్నసంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥**

పరిశీలించి చూస్తే – అన్నంవల్లనే ప్రాణులు జీవిస్తున్నాయి. అన్నం మేఘాలు వర్షించటంవల్ల ఉత్పన్నమౌతున్నది. మేఘాలు యజ్ఞాలవల్ల ఏర్పడుతున్నాయి. యజ్ఞాలు కర్మవల్ల – పద్ధతిప్రకారం ఆ యా ఋతువులలో చేయటంవల్ల ఏర్పడుతున్నాయి.

**శ్లో ॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥**

ఏయే యజ్ఞాలు ఎలా చెయ్యాలో మనకు వేదజ్ఞానం వల్ల తెలిసింది. వేదం అక్షరమగు నాశరహితమగు పరబ్రహ్మవల్ల ప్రకటింపబడింది. అట్టి సర్వవిద్యల

నిలయమైన వేదం నిత్యం యజ్ఞం చేయమంటున్నది.

**శ్లో ॥ ఏవం ప్రవర్తితం చక్రం న+అనువర్తయతీహ యః ।**
**అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥**

- భగవద్గీత (3-10 నుండి 16)

"పరమేశ్వరునిచే ఏర్పరచబడిన ఈ యజ్ఞచక్రమును ఎవరు అనుసరించరో వారు పాపులు, వ్యర్థంగా జీవించేవారు అవుతారు" అని మన ఆదర్శ కర్మయోగి శ్రీ కృష్ణుడు అన్నాడు.

వివిధ యజ్ఞాలను, వాటివల్ల కలిగే వివిధ ప్రయోజనాలను ఉపదేశించే యజుర్వేదం నవసస్యేష్టి యజ్ఞం గురించి ఏమంటుందంటే -

**వ్రీహయశ్చమే, యవాశ్చమే, మాషాశ్చమే, తిలాశ్చమే, ముద్గాశ్చమే, ఖల్వాశ్చమే, ప్రియఙ్గవశ్చమే, అణవశ్చమే, శ్యామాకాశ్చమే, నీవారాశ్చమే, గోధూమాశ్చమే, మసూరాశ్చమే యజ్ఞేన కల్పన్తామ్ ॥**- యజుర్వేదం (18-12)

మా యొక్క వ్రీహలు (బియ్యము), యవలు (యవధాన్యం), మాషలు (మినుములు), తిలలు (నువ్వులు), ముద్గలు (పెసలు), ఖల్వలు (శనగలు), ప్రియంగములు (అరికెలు), అణవలు (సన్నబియ్యం), శ్యామాకాలు (సామధాన్యం), నీవారములు (దూసవరి బియ్యం), గోధుమలు, మసూరములు (చిరుశనగలు) (చ) మరియు ఆ యా జాతులకు చెందిన ధాన్యాలు, పప్పులు, వాటితో తయారైన పదార్థాలు అన్నీకూడా యజ్ఞేన కల్పంతామ్ = యజ్ఞస్వరూపుడైన సర్వవ్యాపక సృష్టికర్తచే సృజింపబడి అగ్నిహోత్రంవల్ల సమర్థవంతములౌతాయి. అంటే అగ్నిహోత్ర కార్యంతో మరింత పుష్టిని, పుష్కలతను పొందుతాయి.

ఆంగ్లార్థం : May my rice and my barley, my pulses and beans, my sesamum and grams, my beans and their cookings, my grams and their cooking, my millet and its cooking, my excellent rice and inferior corn, my rice of wild growth and their cooking, my wheat and its cooking, my lentils and other food grains prosper through the grace of God and Agnihotra.

అగ్నిహోత్రంవల్ల కలిగే ప్రయోజనాలు అనేకం. అది పూర్తిగా వైజ్ఞానికం. వివరంగా తెలుసుకోగోరువారు నా రచనలు "అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం, అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ"చదువగోరుచున్నాను. పూర్వం హోళీ పండుగనాడు అప్పటికి యింటికి వచ్చిన క్రొత్త ధాన్యాలతో నవసస్యేష్టి యజ్ఞం ప్రతి ఇంటా చేసేవారు. కాలాంతరంలో అది సామూహికంగా గ్రామ ప్రజలంతా ఒక చోట చేరి పెద్ద యజ్ఞకుండాన్ని నిర్మించుకొని చేయటానికి అలవాటు పడ్డారు. వారి వారి యిండ్లలోని క్రొత్త ధాన్యాలను తెచ్చి ఆహుతులుగా అర్పించేవారు. రాబోవు వసంత ఋతువునకు స్వాగతం పలుకుతూ ఒకరిపై ఒకరు పువ్వులు, పువ్వులరసం చల్లుకొని హోళి కోత్సవం జరుపుకునేవారు. క్రమంగా అది వికృత రూపం ధరించి కూడళ్ళలో (చౌరాస్తాలలో) కట్టెలు, పిడకలు ప్రోగేసి మంటపెట్టి చెత్తా చెదారం, హానికారక పదార్థాలు కూడా వేస్తూ అసభ్య పాటలు పాడుతున్నారు. కృత్రిమ రంగులను, హానికారక రాసాయనిక రంగులను ఒకరిపై ఒకరు జల్లుకుంటున్నారు. ముఖాలను గుర్తుపట్టలేనంత వికారంగా చేసుకుంటున్నారు. ఆ రంగులు ఎంత సబ్బులుపెట్టి తోమినా కొన్ని రోజులవరకు పోనంతగా ఉంటున్నాయి. కొందరైతే వావి వరుసలు, స్త్రీ పురుషభేదాలు పాటించకుండా రంగులు చల్లుకుంటున్నారు. అసభ్య పలుకులు పలుకుతున్నారు. పెద్దలు, విజ్ఞులు ఏమీ చేయలేక కలియుగం, కలికాలం అనుకుంటూ సరిపెట్టు కుంటున్నారు.

ఈ హోళీపర్వ అసలు స్వరూపాన్ని యింకా ఎక్కువగా తెలుసుకోగోరువారు మీ సమీపంలోని ఆర్యసమాజ మందిరాలలో జరిగే నవసస్యేష్టి హోళీహోమానికి వెళ్ళండి. మీ స్వార్జితంతో ఆవునేతిని, కొన్ని క్రొత్త ధాన్యాలను కొని తీసుకువెళ్ళి ఆహుతులుగా యివ్వండి. అగ్ని తనలో వేసిన పదార్థాలను సూక్ష్మాణువులుగా మార్చి గాలిలో కలిపివేస్తుంది. తన దగ్గర పెట్టుకోదు. ఆ గాలి పీల్చిన అన్ని ప్రాణులకు అది సూక్ష్మరూపంలో అందుతుంది. సుగంధాన్నీ, పుష్టినీ, ఆరోగ్యాన్నీ యిచ్చే పదార్థాలను వేస్తే అవే మనకు లభిస్తాయి. దుర్గంధాన్నీ, అనారోగ్యాన్నీ, ఆయాసాన్నీ కలిగించేవి వేస్తే అవే మనం అనుభవించవలసి వస్తుంది. తస్మాత్ జాగ్రత!

# పతివ్రతాశిరోమణి సీతామాత

## (సీతాష్టమి (ఫాల్గుణ బ.అష్టమి) సీతామాత జన్మదినం)

వాల్మీకి రామాయణాన్ననుసరించి సీతాదేవి ఫాల్గుణ బ. అష్టమినాడు జన్మించినట్లు తెలుస్తున్నది. ఆ కాలంలో జనక మహారాజు గొప్పవీరుడు, చక్రవర్తియేగాక అత్యున్నత ఆధ్యాత్మిక గురువు. ఆధ్యాత్మికవిద్యలో తీవ్రజిజ్ఞాస కలిగిన సాధకుల గూఢమైన ప్రశ్నలకుకూడా ఆయన సరళంగా సమాధానాలు చెప్పేవారట. ఆ నాటి గురుకులాచార్యులు, ఋషులు తమ శిష్యులను ఆత్మవిద్యలోని రహస్యాలను తెలుసుకోవటానికి ఆయన వద్దకు పంపేవారు. ఆయన తీరికలేని రాచకార్యాలలో ఉండికూడా జీవన్ముక్తునిగా జీవించిన గొప్పయోగి. అందుచేతనే ఆయనను 'విదేహు'డనేవారట. అట్టి జగద్గురువు జనకునికి జన్మించినదే మన సీతామాత.

సీతామాత జనాన్ని గురించి లోకంలో ఒక కథ ప్రచారంలో ఉంది- జనకునికి చాలా కాలం సంతానం కలగకపోతే ఆయన ఒక పెద్ద యజ్ఞం చేయ సంకల్పించారనీ, అందుకు ఆయన స్వయంగా భూమిని దున్నుచుండగా నాగలికి ఒక పెద్ద పెట్టె తగులు కొని బయట పడిందనీ, తెరచిచూడగా ఒక పాప ఉందనీ, ఆ పాపనే జనకుడు పెంచుకొని పెండ్లి చేశాడనీ...... ఒక కల్పిత కథ ప్రచారంలో ఉంది. వాల్మీకి రామాయణాన్ని సూక్ష్మంగా అధ్యయనం చేస్తే ఈ కథ సత్యం కాదని స్పష్టమౌతుంది. ఈ క్రింది శ్లోకాన్ని పరిశీలించండి-

**శ్లో. వీర్యశుల్కేతి మే కన్యా నామ్నా సీతేతి విశ్రుతా ।**
**యోగిన్యాస్తనయాం తాం తు వర్ధమానాం మమాత్మజామ్ ॥**

- సంపూర్ణ విశుద్ధ శ్రీమద్ వాల్మీకి రామాయణం (బాలకాండము, 25-7)

"(నా రెండవ భార్య) యోగిని గర్భంనుండి జన్మించిన నా కన్య 'సీతా' నామంతో ప్రసిద్ధి చెందింది. నేను ప్రతిజ్ఞ చేసినట్లుగా ఈమె వీర్యశుల్క, అంటే - పరాక్రమాన్ని ప్రదర్శించి పొందదగిన కన్య. కనుక మీ శిష్యులు తమ పరాక్రమాన్ని నిరూపించుకొని పొందవచ్చు" నని జనకుడు విశ్వామిత్రమహర్షితో అన్నాడు.

పై శ్లోకంలోను, తదుపరి శ్లోకాలలోను మమ ఆత్మజా, మమ సుతా అనే పదములు 4,5 పర్యాయాలు కనబడతాయి. శివపురాణం ఈ విషయాన్ని మరింత

స్పష్టం చేస్తూ "ధన్యా ప్రియ ద్వితీయాతు యోగినీ జనకస్య చ, తస్యా కన్యా మహాలక్ష్మీర్నామ్నా సీతా భవిష్యతి ॥" (ప్రార్థనా ఖండం) అన్నది. వివాహసమయంలో పురోహితులు శ్రీరాముని 35 తరాలను, సీతకు చెందిన 22 తరాలను పేర్కొంటూ జనక సుతా, జనకస్యేవ అంటూ గొప్ప వంశాలలో పుట్టిన వధూవరులన్నారు. కొన్ని చోట్ల 'ఔరస పుత్రి' యని ఉంది. ఔరసి, ఔరసుడు అనే పదములు అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యద్వారా కలిగిన సంతానానికే వర్తిస్తాయి. కనుక లోకప్రచలిత సీతాజనన కథను ఈ క్రింది విధంగా అర్థంచేసుకుంటే తర్కసంగతంగా ఉంటుంది.

జనక మహారాజునకు చాలాకాలం వరకు సంతానం కలుగలేదు. రెండవ భార్యగా 'యోగిని' నామం కల కన్యను పెండ్లాడినాడు. అనంతరం ఒక పర్యాయం 'సీతాయజ్ఞం' చేసిన తదుపరి యోగిని గర్భవతి అయ్యింది. ఆమెకు ఆడబిడ్డ కలిగింది. సీతాయజ్ఞానంతరం కలిగింది కనుక ఆ బిడ్డకు జనకమహారాజు 'సీతా' అని నామకరణం చేశాడు. మరికొంత కాలానికి మొదటి భార్యకూడా గర్భవతియై ఆడబిడ్డను కన్నది. ఆ రెండవ బిడ్డకు 'ఊర్మిళ' అని నామకరణం చేశాడు. సీత పెద్దబిడ్డ, ఊర్మిళ చిన్నబిడ్డ అయ్యారు. సీతాయజ్ఞం అంటే – తొలకరివానలు పడిన తరువాత రైతులు నాగళ్ళను సిద్ధం చేసుకొని పొలాలను దున్నటం ఆరంభించటం. దీనిని కొన్ని చోట్ల 'ఏరువాక' పండుగ అంటారు. సంస్కృతంలో 'సీతా' అంటే 'నాగటిచాలు'. వేదాలలో సీతా పదం కొన్ని చోట్ల కనబడుతుంది. ముఖ్యంగా అథర్వ వేదంలోని "కృషీవల సూక్తం" లో ప్రముఖంగా కనబడుతుంది. 9 మంత్రాలుగల ఆ సూక్తంలోని ఒక మంత్రం ఏమంటుందంటే –

**సీతే వన్దామహే త్వార్వాచీ సుభగే భవ।**
**యథా నః సుమనా అసో యథా నః సుఫలా భువః ॥**

– అథర్వవేదం (3-17-8)

"హే సీతే – దున్నబడిన ఓ భూమీ! నీకు మా వందనములు, ఓ సౌభాగ్యవతీ! నీవు మాకు అన్నాన్నీ, ఐశ్వర్యాన్నీ ప్రసాదించే సౌభాగ్యలక్ష్మివి. నీవు సదా మావద్దనే ఉండుము. మాపై నీ ప్రసన్నతను ప్రసరింపచేయుము. మమ్ము సిరిసంపదలతో సౌభాగ్యవంతులను చేయుము".

ఇట్టి కృషీవల సూక్తాలనుండే ఆదిమానవులకు వ్యవసాయవిద్య తెలిసింది.

అది క్రమంగా వికసిస్తూ నేడు అది కృషివిజ్ఞానంగా రూపుదిద్దుకుంది. కనుకనే మన ఋషులు **"సమస్త సత్యవిద్యలకు మూలం వేదం"** అన్నారు. డార్విన్ వికాసవాదంతో మానవులు జ్ఞానవంతు లయ్యారనేవారికి మాదొక ప్రశ్న - ఏ ఏ జంతువులను అనుకరించి మానవులు వ్యవసాయం నేర్చుకున్నారు ?

ఇక మనం సీతామాతలోని వైశిష్ట్యాన్ని గురించి ఆలోచిద్దాము. జనక మహారాజు తనయగా ఆమెకు చిన్ననాటి నుండి మంచి సభ్యతా సంస్కారాలు అలవడ్డాయి. ఇది ఆమె పూర్వ జన్మలలో చేసుకున్న పుణ్యఫలం. గురువులవద్ద ఆమె సామాన్య విద్యలనేగాక బ్రహ్మవిద్యను, క్షాత్రవిద్యనుకూడా నేర్చుకుంది. బల పరాక్రమాలు గల క్షత్రియ యువతిగా ఎదిగింది. వారి పూర్వులు వాడిన సుదృఢమైన విల్లునువంచి నారిని బిగించగలిగింది. అది చూసిన జనకుడు "నా కన్య విద్యావంతురాలేగాక మంచి బలవంతురాలు. క్షాత్రవిద్యలు నేర్చిన క్షాత్రాణి. ఆమెకు తగిన వరునిని వెతికి వివాహం చేయవలసిన బాధ్యత నాపై ఉంది. కనుక నేను ఆమెకు స్వయంవరం ప్రకటించాలి" అనుకున్నాడు. "మా పూర్వులు వాడిన శివధనుస్సును ఎక్కుపెట్టి లక్ష్యాన్ని ఛేదించగల యువకునికే నా కన్యనిచ్చి వివాహం జరిపిస్తా" నని ప్రతిజ్ఞ చేసి స్వయంవరం ప్రకటించాడు. ఆ సందర్భంలో రామలక్ష్మణులు, "సముపస్థిత యౌవ్వనులనీ, సీతలో యౌవ్వనం నిండుగా ఉండటం గమనించిన జనకుడు" అని వాల్మీకి మహర్షి వ్రాశారు. కనుక సీతాదేవిది బాల్యవివాహం అనేవారు కాస్త ఆలోచించండి. స్త్రీలకు యౌవ్వనం 18-25 సంవత్సరాల మధ్య పూర్ణత్వాన్ని పొందుతుందనీ పురుషులకు 25-35 మధ్య అని మన ఆయుర్వేద వైద్యగ్రంథాలు చెబుతాయి. కనుక సీతారాములది బాల్యవివాహం కాదు.

సీతారాముల కళ్యాణ మహోత్సవం వాల్మీకి రామాయణం బాలకాండంలో 5వ సర్గలలో చాలా చక్కగా వర్ణింపబడింది. దయానంద మహర్షి తమ 'సంస్కార విధి' గ్రంథంలో వ్రాసినట్లుగా వైదిక పద్ధతిలో అగ్నిహోత్రపూర్వకంగా పాణీగ్రహణ మంగళ ప్రదక్షణాది క్రియలన్నీ జరిగాయి. కొంతకాలం తరువాత తండ్రిచేసిన వాగ్దానం నెరవేర్చటానికి శ్రీరాముడు 14 సంవత్సరాలు వనవాసం చెయ్యటానికి బయలుదేరాడు. సీత తానుకూడా వెంటవస్తానన్నది. రాముడు

వనవాసంలో ఉండే అనేకానేక యిబ్బందులను, కష్టాలను ఏకరువు పెట్టినా వినలేదు. నేను వీరవనితను. పులులకు సింహాలకు భయపడేదానినికాను. మీతో కలిసి ఉండటమే నాకు స్వర్గం. మిమ్ము విడిచివుంటే ఎన్ని రాజభోగాలున్నా నరకమే. మీరు నన్ను తీసుకువెళ్ళకుంటే విషంత్రాగిగానీ, అగ్నిలోదూకిగాని, నదిలోపడిగానీ ప్రాణాలు విడుస్తానన్నది. దానితో చేసేదిలేక రాముడు అంగీకరించవలసి వచ్చింది. లక్ష్మణుడును అట్లే అన్నాడు. ముగ్గురూ తమ వస్త్ర ఆభూషణాదులన్నిటిని సత్పాత్రులకు దానమిచ్చి నారచీరలు, నారవస్త్రాలు ధరించి వనాలకు వెళ్ళారు.

వనాలలో ఎన్ని యిబ్బందులున్నా భర్త సాన్నిధ్యంలో సీతాదేవి సంతోషంగా గడిపింది. ఋషుల ఆశ్రమాలను, అడవి అందాలను చూసుకుంటూ ఆనందంగా గడిపింది. దురదృష్టవశాత్తు రావణాసురుడు సీతను అపహరించుకుపోతే రాముడు బేలవలె విలపించాడు. సీతయు మిక్కిలిగా దుఃఖిస్తూనే లంకలో ధైర్యంగానే గడిపింది. రావణుడు ఎంతగా భయపెట్టినా, ప్రలోభపెట్టినా లొంగలేదు. ధైర్యంగా "ఏ నాటికైనా నా రాముడువచ్చి నిన్ను సంహరించి నన్ను తీసుకుపోతా" దని ఎదిరించి చెప్పేది. సీతారాముల అన్యోన్యానురాగం తరతరాలకు ఆదర్శంగా సృష్టి ఉన్నంతకాలం నిలిచి ఉంటుంది **"ఇహే మావిస్త్ర సం నుద చక్రవాకేవ దంపతీ"** (అథర్వవేదం 14-2-64) - వధూవరులు చక్రవాక పక్షుల జంటవలె అన్యోన్యానురాగ బద్ధులై ఉండాలనే వేద సందేశాన్ని వారిరువురు ఆచరించి చూపించారు.

సుమారు 20 సంవత్సరాల క్రిందిటి మాట. క్రొత్తగా **T.V.** లు వాడుకలోనికి వచ్చిన సమయంలో శ్రీ రామానంద సాగర్ గారు రామాయణాన్ని హిందీలో **T.V.** సీరియల్‌గా చిత్రీకరించి చూపించారు. నటీనటులు, దర్శకులు చాలా వాస్తవంగా సహజంగా ఆ చిత్రం చిత్రీకరించారు. హిందువులేకాక ఇతర మతాలవారు, నాస్తికులుకూడా దానిని ఎంతో ఆసక్తితో చూచేవారు. మిగతా పనులన్నీ పక్కకుపెట్టి **T.V.** లముందే కూర్చునేవారు. దాంపత్యం అంటే సీతారాములవలె ఉండాలని స్త్రీలంతా కోరుకున్నారు. స్త్రీలు పతివ్రతలైనట్లే పురుషులు పత్నీవ్రతులు కావాలని ఆ విధంగా సీతారాములు జీవించి చూపించారు.

ఆ **T.V.** సీరియల్‌ను విదేశాలలో విదేశీయులుకూడా చాలా మంది ఆసక్తితో తిలకించారు. రష్యాదేశంలో అయితే ఒక నాటక బృందం రామాయణాన్ని

వారి భాషలో నాటకంగా వ్రాసుకొని ప్రదర్శించారు. ఆ ప్రదర్శనలు సంవత్సరాల కొలది చాలా పట్టణాలలో పర్యటించాయి. చూసినవారు మరల మరల చూశారు. ముఖ్యంగా అందులో రామునిగా నటించిన ఒక రష్యాదేశీయునిపై అద్భుతమైన ప్రభావాన్ని చూపించింది. ఆ నాటక బృందం ఏ పట్టణానికి వెళ్ళినా మిగతా వారంతా లాడ్జింగ్‌లలో ఉంటే తానుమాత్రం ఊరుబయట ఒక గుడారం వేసుకొని ఒక మునిగా గడిపేవాడు. సామాన్య జీవితంలో కూడా రామునివలెనే వ్యవహరించేవాడు. నడకలో, మాటలలో అన్నీ రామునివలనే ధర్మాత్మునిగా వ్యవహరించేవాడు. వయసు మీరినా అతడు పెండ్లి చేసుకోలేదు. ఒక పట్టణంలో ఈయన ప్రవర్తన చూసిన పత్రికా విలేఖరులు ఆయనను చుట్టుముట్టి ప్రశ్నల వర్షం కురిపించారు. అందుకు ఆయన చెప్పిన సమాధానం ఏమంటే -

"నేను చాలాకాలం రామునివేషం వేయటంవల్ల అట్టి గుణ కర్మ స్వభావాలే నాలో బలపడ్డాయి. అందుచే ఈ విధంగా మునిగా జీవిస్తున్నాను" అన్నాడు. మరి, పెండ్లి ఎందుకు చేసుకోలేదు ? అని అడిగారు. 'సీతవంటి కన్య దొరికితే తప్పక పెండ్లి చేసుకుంటాను. కాని, నా కింతవరకు అట్టి కన్య కనబడలేదు' అన్నాడట. అప్పటి దినపత్రికలన్నీ ఆ విషయాన్ని ప్రచురించి ప్రపంచాన్ని ఆశ్చర్యపరచాయి. ఇది ఎంత గొప్ప ఆదర్శమో చూడండి. దంపతులంటే సీతారాములవలె కష్ట సుఖాలన్నిటిలో కలిసి ఉండాలి. అందుకనే "ప్రతీ ఇంటా వాల్మీకి రామాయణం పఠిస్తూ ఉండాలి. ఆ విధంగా భార్యాభర్తలు, తండ్రీకొడుకులు, అన్నదమ్ములు, వదినా మరుదులు ఉండటానికి ప్రయత్నించా లంటారు పెద్దలు. అస్తు - మనం ఆ విధంగానే చేద్దాం.

పై కారణాలచేతనే ఆర్యవిద్వాంసులు రామకృష్ణుల జన్మదినాలు జరుపుకునేటట్లే సీతామాతా జన్మదినంకూడా జరుపుకోవాలని "ఆర్యపర్వపద్ధతి" లో చేర్చారు. ఆ దినం (ఫాల్గుణ బ. అష్టమి నాడు) బృహత్ యజ్ఞవిధిని జరిపి చివరగా ఈ క్రింది వేదమంత్రాలతో విశేష ఆహుతులివ్వాలని నిర్దేశించారు. ఆ మంత్రాల అర్థం సంక్షిప్తంగా తెలుసుకుందాము.

**ఓం అక్ష్యౌ నౌ మధుసంకాశే అనీకం నౌ సమంజనమ్ ।**

**అన్తః కృణుష్వ మాం హృది మన ఇన్నౌ సహాసతి ॥**

– అథర్వవేదం (7-36-1)

భార్యాభర్తలమైన మాయిరువురి నేత్రాలు జ్ఞానదృష్టితో ప్రకాశించును గాక! మా యిద్దరి శారీరక బౌద్ధిక బలాలు చక్కగా వికసించును గాక! మా ఒండొరుల హృదయాలలో ఒకరినొకరము ప్రతిష్ఠించుకొందుము గాక! మా యిరువురి మనస్సులు ఒకటగును గాక! (మా మనో వాక్కాయాలు ఒకటగును గాక – అని భావం).

**ఓం అభిత్వా మనుజాతేన దధామి మమ వాససా ।**
**యథాసౌ మమ కేవలో నాన్యాసాం కీర్తయశ్చన ॥**

– అథర్వవేదం (7-37-1)

ఆలోచనా పరుడవైన ఓపతి దేవా! నిన్ను నా వస్త్రంతో (చీరకొంగుతో) ముడివేసుకున్నాను. కనుక నీవు కేవలం నా వాడవే కావాలి. పరస్త్రీలను ధ్యానించవద్దు – వారిపట్ల మోహితుడవుకావద్దు.

పై రెండు మంత్రాల తరువాత 'స్వాహా' కారం పలికి ఆహుతు లివ్వాలి. అనంతరం ఆదర్శ దాంపత్యం గురించిన భజనలు, ఉపన్యాసాలు చెప్పుకోవచ్చు.

ఈ విధంగా మన పర్వాలను (పండుగలను) జ్ఞాన పూర్వకంగా జరుపుకుంటే మన సంస్కృతీసభ్యతలు బలపడతాయి. లేకుంటే పాశ్చాత్య నాగరికతా ప్రవాహంలో కొట్టుకుపోయి కౌటుంబిక జీవితం అస్తవ్యస్తమౌతుంది. తస్మాత్ జాగ్రత!!

**కాలే వర్షతు పర్జన్యః**
**పృథివీ సస్యశాలినీ,**
**లోకోఽయం క్షోభరహితః**
**సజ్జనాః సంతు నిర్భయాః.**



## పుస్తక ముగింపు (Conclusion)

ప్రియ పాఠకులారా!

ఇదీ సంక్షిప్తంగా మన పండుగలలోని పరమార్థం. ప్రతీ యింట ఉండవలసిన గ్రంథం. పండుగకు 1, 2 రోజులముందే ఆ పండుగను గూర్చిన విషయం మరొకసారి చదువుకొని ఆ విషయాలను మననం చేసుకుంటూ ఆ పండుగను జరుపుకుంటే శ్రద్ధా భక్తులు, వివేక వైరాగ్యాలు బలపడతాయి. దానితో మనం భగవంతునికి దగ్గరౌతాము. అప్పుడు పండుగలు మనకు భౌతిక సుఖసంతోషాలతో బాటు జ్ఞానవికాసం, బౌద్ధిక ఆనందం, ఆత్మికోన్నతి కలుగుతాయి. జన్మ ధన్యమౌతుంది.

అయితే, పండుగరోజున ఆ పండుగకు చెందిన విశేషహోమం తప్పక చెయ్యాలంటారు మన ఋషులు. అదే నిజమైన దేవపూజ అంటారు. సర్వవ్యాపక సర్వేశ్వరునికి శరీరం, ఆకలి దప్పికలు ఉండవు. కనుక, మూర్తులను షోడశోపచారాలతో పూజించటం వ్యర్థమైన కార్యం. ఆయనే మనకు ఆహారపానీయాదుల నిస్తున్నాడు. అట్టివానికి నైవేద్యాలా? అందుకనే ఋషులేమన్నారంటే గృహస్థులు పంచమహాయజ్ఞాలు, పర్వయజ్ఞాలు చేసుకుంటే సరిపోతుందన్నారు. సంధ్యోపాసనద్వారా దైవకార్యం జరిగిపోతుందన్నారు. అందుచేతనే దానిని బ్రహ్మయజ్ఞమనీ మొదటి మహాయజ్ఞమనీ అన్నారు.

రెండవది దేవయజ్ఞం. పంచ మహాభూతాలను, వసు రుద్ర ఆదిత్యాది 33 దేవతలను అగ్నిహోత్రంద్వారా అర్చించాలి. "అగ్నిర్ వై దేవానాం ముఖమ్" అని చెప్పినట్లు ఈ 33 దేవతలకు అగ్ని ముఖంగా (అంటే - నోరుగా, జీర్ణకోశంగా) ఉంటుందన్నారు. అది హవ్య ద్రవ్యాలను భస్మంచేసి సూక్ష్మాణువులుగా మార్చి వాయుదేవత కిస్తుంది. ఆ వాయువును పీల్చిన చరాచర ప్రాణులన్నిటికి అది అందుతుంది. కొంతభాగం మేఘాలలో చేరి, అవి వర్షించినపుడు భూమిపైకి చేరి ఎరువుగా మారుతుంది. అగ్నిహోత్రం మిగిలిన దేవతలనన్నిటిని శుద్ధచేస్తుంది. ప్రాణులన్నిటిని పోషిస్తుంది. అందుచేతనే వేదం అగ్నిహోత్రాన్ని "ప్రజాపతి - ప్రజలను పాలిస్తుంది" అంటుంది. కనుక పండుగరోజు మీ యింట్లో సపరివారంగా కూర్చుని అగ్నిహోత్రాన్ని - దేవ పూజను - దేవయజ్ఞాన్ని చెయ్యండి.

ఆ విధంగా చేయ వీలుపడకపోతే మీ సమీపంలోని ఆర్యసమాజ మందిరానికి వెళ్ళి సామూహిక పర్వయజ్ఞంలో పాల్గొనండి.

'సర్వేజనాః సుఖినో భవంతు'

ఓ3మ్ స్వస్తి స్వస్తి స్వస్తి.

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (20-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (20-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీ కృష్ణుడు (8-00), వైదిక వివాహ వైశిష్ట్యము (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), మహర్షి మనువుపై విరోధమెందుకు? (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), బ్రహ్మచర్య విజ్ఞానము (15-00), శ్రీ దయానంద హృదయము (12-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), దయానందుని ఆదర్శరాజ్యం (1-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), చతుర్వేద సరస్వతీ సూక్తము(10-00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60/-). పెండ్లినాటి ప్రమాణాలు (40/-), పండుగల పరమార్థం (40/-), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25/-).



# VEDIC SHANTHI PRAYER

ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతి,
రాపః శాంతి ఓషధయః శాంతి వనస్పతయః శాంతిః ।
విశ్వేదేవాః శాంతిః బ్రహ్మశాంతిః సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః సా మా శాంతి రేధి ॥

- యజుర్వేదం (36-17).

ద్యు లోకము, అంతరిక్షము, భూమి జలము ఓషధులు, వనస్పతులు ఎల్ల విద్వాంసులు, వేదము, సంపూర్ణ ప్రపంచము, స్వయముగా శాంతియై శాన్తి నిచ్చుగాక! ఆ శాంతి నన్ను చేరి వర్ధిల్లు గాక!

May sky be peaceful. May atmosphere be peaceful. May Earth be peaceful. May waters be peaceful. May medicinal herbs be peaceful. May plants be peaceful. May all the learned persons be peaceful. May God and the Vedas be peaceful. May all the objects be peaceful. May peace itself be peaceful. May that peace come unto me.

Gayatri Series : 61

**PANDUGALA PARAMARDHAM....** Price : **Rs. 40/-**




వేదోపదేశం :

పరీత్య భూతాని పరీత్యలోకాన్, పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ।
ఉపస్థాయ ప్రథమజామృతస్యాత్మనాఽఽత్మానమభి సంవివేశ ॥

- యజుర్వేదం (32-11).

**వాక్యార్థం :**

**పరీత్య భూతాని పరీత్య లోకాన్** = ఓ మానవులారా! సృష్టికర్త అన్నిటినీ సృజించి అన్ని ప్రాణులలోను, అన్ని లోకాలలోను అన్ని వైపులనుండి (పరీత్య) వ్యాపించియున్నాడు.

**పరీత్య సర్వాః ప్రదిశః+దిశః+చ** = అన్ని దిక్కులలోను, అన్ని మూలలలోను వ్యాపించియున్నాడు.

**ఉపస్థాయ ప్రథమజామ్ +ఋతస్య**= సృష్ట్యాదిలో ముందుగా పుట్టిన వేదజ్ఞానాన్ని ఆశ్రయించిన విద్వాంసులు, యోగులు

**ఆత్మనా+ఆత్మానమ్+అభి సంవివేశ** = నేరుగా తమ ఆత్మలలో వ్యాపించియున్న పరమాత్మలో ప్రవేశించి అనిర్వచనీయమైన ఆనందము ననుభవింతురు. పరమ సత్యాన్ని ప్రాప్తింతురు.

God manifests himself pervading the five elements, all the worlds and all the quarters and mid-quarters. The learned person having studied the four vedas created in the beginning, unites himself with God, the embodiment of Truth.

Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj - Vyasnagar, Medibavi,
Seethaphalmandi, Secunderabad - 500 061. (Telangana)
**Cell : 9908994084, 9848011073, 9948539795.**